శ్రీ

# సూర్యశతకము

(మయూరమహాకవి సంస్కృత మూలమునకు తెలుగు అనువాదము)

## మహాకవి దాసు శ్రీరాములు



:: ప్రకాశకులు ::

మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి

3-4-885/A, బర్కత్‌పురా, హైద్రాబాదు-27.



# సూర్యశతకము

(మయూరమహాకవి సంస్కృత మూలమునకు తెలుగు అనువాదము)


## మహాకవి దాసు శ్రీరాములు





:: ప్రకాశకులు ::

మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి

3-4-885/A, బర్కత్‌పురా, హైద్రాబాదు-27.

ప్రథమ ముద్రణ - 1902
ద్వితీయ ముద్రణ - 1979
300 ప్రతులు.



ప్రతులకు :
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి
వాణీసదనము 3-4-835/A,
బర్కత్‌పురా, హైదరాబాదు-27.

వెల : రూ. 4-00

ముద్రణ :
శ్రీ మాధవి ఆర్ట్ ప్రింటర్స్,
కుత్బిగుడ, హైదరాబాదు - 27.



మహాకవి దాసు శ్రీరాములు
1846—1908.

# నివేదనము

గ్రంథకర్త శ్రీ దాసు శ్రీరాములుగారు క్రీ. శ. 19వ శతాబ్ది ఉత్తరార్ధమున తెలుగుదేశమున జీవించి, ఆంధ్రసాహిత్యమును తమ అమూల్యమైన రచనలచే అలంకరించిన మహాకవి. శ్రీరామకవి కవితావ్యవసాయము శ్రీనాథకవివలె పంద్రెండవయేటనే ప్రారంభమైనది. శతకములు, ప్రబంధములు, పురాణములు, నాటకములు, శాస్త్రగ్రంథములు - ఇట్లెన్నో ప్రక్రియలలో వారు రచనలు గావించియుండిరి. శ్రీరామకవీంద్రుల కృతు లిప్పుడు పాఠకలోకమున కందుబాటులో లేవు. వానిని పునర్ముద్రించి ప్రజల కందించు దృష్టితో, దాసు వంశమునందు జన్మించి ఆ మహాకవియశస్సును వారసత్వముగా ననుభవించుచున్న మేమందరము కలిసి "మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి"ని హైదరాబాదులో 1978 వ సం॥ డిసెంబరునెలలో స్థాపించితిమి.

మా ప్రచురణ కార్యక్రమములో మొదటిది తెలుగువారి నాటి యాచార వ్యవహారములను దెలియుట కుపకరించు పద్యగ్రంథము "తెలుగు నాడు." రెండవది వారి వచనకృతి "అభినవ గద్యప్రబంధము." ఈ గ్రంథము విశ్వవిద్యాలయపరీక్షలకొఱకే ప్రత్యేకముగా రచితమైననూ, ఆ కాలమునందలి వచన గ్రంథ రచనావిధానము ననుసరించి విద్యార్థులకేగాక విద్వాంసులకుగూడ నుపయుక్తమగునట్లు రచింపబడినది. తదుపరి వారి జయంతిసంచిక 1975 లో ప్రఖ్యాతరచయితల వ్యాసములతో 'ప్రపంచ తెలుగుమహాసభల' సందర్భములో ప్రచురించితిమి. ఆంధ్రదేశములో అనన్యమైన ప్రాశస్త్యము పొంది గ్రంథకర్తకు 'మహాకవి' యను బిరుదమును సమకూర్చిన "శ్రీ దేవీభాగవతము"ను గతసంవత్సరము ముద్రించి ప్రచురించగల్గిన సుకృతము మా సమితికి కలిగినది.

మయూరకవి సంస్కృతమున రచించిన సూర్యశతకము తెలుగు అనువాదము శ్రీరాములుగారు గావించి, 1902 సం॥లో ప్రచురించిరి. కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసి యిచ్చిన తాత్పర్యసహితముగా ఈ పర్యాయము సూర్యశతకమును ప్రచురించుచున్నాము. పద్యములకు సులభశైలిలో తాత్పర్యము వ్రాసి యిచ్చినందుకు వారికి మా సమితి కృతజ్ఞతలు. ఈగ్రంథమున ముద్రణాస్ఖాలిత్యములు లేకుండునటుల సరిచూచిన డాక్టరు జి.వి. సుబ్రహ్మణ్యంగారికి మా కృతజ్ఞతాభివందనములు.

హైద్రాబాద్
17-10-1979

దాసు పద్మనాభరావు
అధ్యక్షుడు
మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి.

# పీఠిక

ఈ ఆంధ్ర సూర్యశతకమునకు మూలము సంస్కృతమున మయూర మహాకవి రచించిన సూర్యస్తుతి పరమగు శతకము.[1] అతిభయంకర మగు కుష్ఠ రోగముచే, దేహ మవసియున్న సమయమున ననవద్యమగు భక్తిప్రపత్తులతో సూర్యుని స్తుతించి, తనరోగమును బాపుకొనిన మయూరుడు, కవిత్వము నకా దింత మహత్త్వ మున్నదని ప్రథమముగా లోకమునకు చాటినాడు-అతడు క్రీ. శ. 620 ప్రాంతమువాడు-ఈ పదమూడు శతాబ్దులనుండియు, సంస్కృత సాహితీ ప్రపంచమున-నాడును నేడును ప్రసిద్ధుడై యున్నవాడు.

మయూర కవివాగ్గుంభన మతిప్రౌఢమైనది - ఈ సూర్యశతకము కావ్య ప్రశస్తిని బడసినది- ఆనందవర్ధనుడు మొదలుగా నాలంకారికు లెల్లరును దీని నుండి యుదాహరించిరి. దీనికి, పదునాలుగు వ్యాఖ్య లున్న వన్నచో దీని విశిష్టత తేటపడగలదు-ఇది ఖండాంతర భాషలలోను పరివర్తిత మైనది.

భారత వర్షమున, తక్కిన ప్రాంతముల కన్న ఆంధ్రదేశమున నీ సూర్యశతకము ప్రచుర ప్రచారము బడసినది. దీని వ్యాఖ్యాతలలో మువ్వు రాంధ్రులు- దీనిని ననుసరించి, సంస్కృతమున - వారణాసి ధర్మసూరి, లింగ కవి, చదలువాడ సుందరరామ శాస్త్రి-స్రగ్ధరావృత్తములతో శతకములు రచించిరి. సుప్రసిద్ధాంధ్ర దేశీయాలంకారికుడు- జగన్నాథ పండితరాయలు-సుధాలహరి దీనిననుసరించి స్రగ్ధరలలోనే రచించెను.

## సూర్యశతకము - తెలుగు కవులు

మయూర కవి సూర్యశతకమును తొలుత తెలుగువారికి పరిచయము చేసినవాడు శ్రీనాథమహాకవి. అతడు కాశీఖండమున 15 శ్లోకములను నాంధ్రీక

---

1. మయూరుని గూర్చి అతని సూర్యశతకమును గూర్చి విపుల మగు పరిశోధనచేసి, "మయూరమహాకవి-ఆంధ్రవాఙ్మయము." అను గ్రంథము రచించితిని. అది ముద్రితము కావలసి యున్నది.

రించినాడు-భీమఖండమున శివరాత్రి మాహాత్మ్యమున మరి రెండు శ్లోకములను తెనుగు చేసినాడు. విశేష మేమనగా, సంస్కృతమున, మయూరకవి రచన యెంత ప్రౌఢమో, తెలుగున శ్రీనాథమహాకవి రచన - అంత ప్రౌఢముగా సాగినది.

## సంపూర్ణానువాదములు

అద్యతన కాలమున - క్రీ. శ. 1893 నుండియు తెలుగున సంపూర్ణానువాదములు ప్రారంభమైనవి. ఈ క్రిందివారి యనువాదములు లభ్యమగుచున్నవి

1. ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రి-గారు(1893)
2. వడ్డాది సుబ్బారాయుడుగారు-(1899)
3. దాసు శ్రీరాములుగారు
4. యామిజాల పద్మనాభస్వామిగారు
5. చదలువాడ జయరామ శాస్త్రిగారు
6. నేమాని సూర్యప్రకాశకవిగారు

పై వానిలో మూడవది యగు-దాసు శ్రీరామ కవీంద్రుని యనువాద విధానమును గూర్చి యీ పీఠికలో వివరించుచున్నాను.

ఈ యనువాదము క్రీ.శ. 1902లో ప్రకటితమైనది కాబట్టి సూర్యశతకానువాదములలో మూడవది. శ్రీరామకవిగారును, పై రెండనువాదములు పరిశీలించియే, తాము తిరిగి దీని ననువదించుటకు పూనుకొనిరి. వ్యాసమూర్తి శాస్త్రిగారు, గొప్ప సంస్కృతపండితులగుటచే, వారియనువాదము తెనుగు కాకపోయినది-వడ్డాది సుబ్బారాయడు గారు, సహజముగా కవులగుటచేత, సంస్కృత మూలమున గల గంభీరార్థములు తెలుగులోనికి రాలేదు-అందువలన శ్రీరామ కవిగారు సూర్యశతకమే గాక, వ్యాఖ్యానములను పరిశీలించి-మయూర కవి కృతిని-పూర్వరీతిగా-

అనువాదములు గాక-

తెనుగు గావించిరి.

మహా గంభీరమైన మయూరకవి భావములను తెలుగువారికి తేటతెల్లము గావించిన యశస్సు, మయూర శతకానువాదకులలో నొక్క శ్రీరాములు గారికే దక్కినది. వా రెట్లు మూలశ్లోకములను తెలుగుచేసినారో చూపుటకు ప్రథమ శ్లోకానువాదములను నిచ్చుచున్నాను.

"జంభారాతీభకుంభోద్భవ దధతం సాంద్రసిందూరరేణుం
రక్తస్సిక్తా ఇవౌఘైరుదయ గిరితటే ధాతుధారాద్రవస్య
ఆయాంత్యాతుల్య కాలం కమలవనరుచే వారుణా విభూత్యై
ర్భూయాసుర్భాసయంతో భువన మభినవా భానవో భానవీయాః"

వసురాయడు :

శ్రీజంభారికరీంద్ర కుంభయుగళీ సిందూర శుంభద్రజో
రాజవ్యాప్తినొ, ప్రాగహార్యతట నిర్యద్ధాతు ధారాద్రవ
స్రాజస్రార్ద్రితనో, సరోద్గమ సరోజాభాప్తినో పొల్చు తత్
భ్రాజన్నవ్యజగద్విభాసి ఘృణు వైశ్వర్యంబు మీ కిచ్చుతన్.

తూర్పుదిక్కున కధిపతియగు ఇంద్రునియైరావతము కుంభముల నుంచిన సిందూర రేణువులవలెను, ఉదయగిరి నుండి స్రవించుచున్న జేగురు ధారల వలెను, కమలవనము నుండి ప్రకాశమానమగు శోణకాంతివలెను నొప్పు నెఱ్ఱనైన సూర్యకిరణములు మీకు శ్రేయస్సుల నిచ్చుగాక - అని తాత్పర్యము.

పై వసురాయనిపద్యమంతయు సంస్కృతభాషామయము- మూలమువలె మనకు తెలుగులో నున్నను నర్థము కాదు - అర్థము కాకపోవుట సరికదా, మూలముకన్న కొన్నియధికముగా, నర్థస్ఫోరకముగాని పదములు యతిప్రాస నిర్బంధమువలన ప్రయుక్తము లైనవి.

వ్యాసమూర్తి శాస్త్రి గారు :

చ. తొలుదెస హస్తికుంభములఁ దోరపుఁజెందిరపుం బ్రజంబునన్
బలె నుదయాద్రి సానువుల భాసిలు జేగురు టేటివెల్లువన్
బలె నపు డొప్పు నంబుజనిభంబలె నెఱ్ఱని డాలు మీఱు వే
వెలుఁగు వెలుంగు మీకు శుభవృద్ధి నిరామయసిద్ధిఁ జేయుతన్.

ఇందు తెలుగు పదము లున్నను - మూలమున నున్న పదస్వారస్యము లేదు. మూలమున జంభారాతిభకుంభము ప్రత్యేకముగా ప్రారంభముననే చెప్పబడినది - ఆపద విశిష్టత యిందు లేదు — 'తొలు దెసహత్తి' కుంభము- అనగా తూర్పుదిక్కున గల యేనుగ - అని యర్థము వచ్చును - కాని జంభా రాతిని తొలుత తెలుపుటలో విశేషమున్నది. అతడు తూర్పుదిక్కున కధిపతి- స్వర్గమునకు నధిపతి-అతడు - సూర్యుని వలె ప్రాతఃకాలమున నైరావతము నెక్కి బయలువెడలును- ఐరావతము తెల్లనిదికావున సిందూరరేఖలు స్పష్టముగా భాసించును-ఇంద్రుడు సూర్యునివలె వైదిక వాఙ్మయమున ప్రస్తుతుడు-కవిత సులక్షణముగా నున్నదిగాని సరసముగా లేదు. ప్రస్తుతానువాదము - చూడుడు.

శా. జేజేరాయని కుంభి కుంభగతమో సిందూరముల్ తాల్చియో
యోజం జేగురుకొంతు లయ్యుదయ శైలోపాంతమం దంటియో
రాజీవప్రభ లేకకాలమున ప్రారంభించియో యెఱ్ఱనై
తేజుల్ గ్రమ్ము నవార్కభాను లిడు నెంతే మీకు నైశ్వర్యముల్.

ఇందు మూలమునందలి ప్రతిపదము తెలుగులో నర్థస్ఫురణతో నిలిచి, మనకు మూలశ్లోక భావము చక్కగా వివృతమై స్వతంత్ర రచనవలె భాసిల్లుచున్నది. మన ప్రాచీన కవులు సంస్కృత శ్లోకానువాదము చేసినప్పు డే పద్ధతి నవలం బించి, దానిని 'తెనుగు'గా చేసిరో శ్రీరాములుగారు నాపథకమునే యనుస రించిరి.

పై పద్యమువలన - శ్రీరాములుగారి యనువాదమున

1. ప్రథమ విశిష్టత- తెనుగు దనము.

2. రెండవది - భావవివృతి

మూలమున శ్లేషాద్యలంకారములతో నున్న భావములను తెలుగున విశదము చేయుట యిందలి మఱియొక విశేషము- ఈ సందర్భమున వ్యాస మూర్తి శాస్త్రిగారి, శ్రీరామ కవిగారి యనువాద విధానములను చూపిన పై యనువాదరీతి స్పష్టపడును.

దత్తానందాః ప్రజానాం సముచిత సమయాకృష్టసృష్టైః పయోభిః
పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశిదిశి విరమ త్యహ్ని సంహారభాజః
దీప్తాంశోర్దీర్ఘ దుఃఖ ప్రభవభయభయోదన్వ దుత్తార నావో
గావోవః పావనానాం పరమ పరిమితాం ప్రీతి ముత్పాదయంతు.

ఈ శ్లోకమున శ్లేషోపమ.

| సూర్యకిరణ పక్షము | ధేనుపరము |
| --- | --- |
| పయోభిః—జలము | పాలు |
| సముచిత సమయం-ప్రాతఃకాలము | వర్షాదికాలములయందు |
| పూర్వాహ్ణే విప్రకీర్ణా-మధ్యాహ్నమున చెదరిపోవును | మధ్యాహ్నము మేతకు బోవును |
| సంహారభాజః-ఉపసంహృతి బొందును | సాయంకాలము ఇండ్లకు చేరుకొనును. |

సూర్యకిరణములు ప్రాతఃకాలమున జలాదికములనిచ్చి, మధ్యాహ్నమున వ్యాపించి, సాయంకాలమున అస్తమించును.

గోవులు ప్రొద్దుట పాలిచ్చి, మేతకుపోయి సాయంకాలము తిరిగివచ్చును. సూర్యకిరణ కాంతివలన దేవతాపరమైన కర్మల నాచరించి సంసార క్లేశము నుండి నరులు విముక్తులగుదురు.

ఆవుపాలవలన దైవవిహితకర్మలను చేసి నరులు ముక్తిమార్గమును పొందుదురు.

దీనికి వ్యాసమూర్తి శాస్త్రిగారి యాంధ్రీకరణము చూడుడు.

మ. సమయాకృష్ట విసృష్ట పుష్కల పయస్సంప్రీతాత్మ ప్రజ
మ్మమితాఘ ప్రభవర్ధవాబ్ధి కలమున న్వ్యాపించత్సవిత్రోధిరా
జము ప్రాహ్ణపరిదిక్ప్రకీర్ణము పునస్సాయం నివృత్తమ్ము గో
సమజ మర్కజ మిచ్చు మీ కమిత హర్షశ్రీ ప్రకర్షమ్ములన్.

ఇందు మూలపదములే యుండి-మూలశ్లోకమువలెనే యున్నది-అనువాద మని తెల్పుటకు, యతిప్రాసలక్షణములు గలవు-దీని వలన మనకు మూలశ్లోకభావ మర్థము కాలేదు సరిగదా; తెలుగు పద్యమునకు వ్యాఖ్యానము కావలయును. శ్రీరామకవిగారెంత సులభసుందరముగా దీనిని తెనుగుచేసిరో చూడుడు.

ఉ. కాలమునుం బయస్సులను గాంచి యొసంగి ప్రజాసుఖం బిదున్
జాలఁ జరించు ప్రొద్దుట, నిశన్ విరమించును, దీర్ఘ దుఃఖజం
బాలభవాబ్ధి కోడలు సుమీ రవి గోవులు భవ్యపావన
త్వాలము లవ్వి మీకుఁ బరమాధిక తుష్టిని పుష్టి నిచ్చుతన్. 9 ప.

ఇందు 'రవిగోవులు' అనుట యెంతో చక్కగా నున్నది - రవిగోవులు సూర్యకిరణములు - సూర్యుని గోవులు ధేనువులు అను అర్థద్వయ మప్రయత్నముగా లభించుచున్నది. 'దీర్ఘదుఃఖ ప్రభవభవ భయోదన్య దుత్తారనావో' అను మూలమునకు రెండు పక్షములు.

"దీర్ఘదుఃఖ జ-బాలభవాబ్ధి కోడలు సుమీ రవిగోవు లనుట యత్యంతము నన్వర్థమై మనోహరముగా నున్నది. మూలమున శ్లేషోపమాలంకారము గలదు. ఈ యనువాదమున కూడ అలంకారము లేకపోలేదు. అందలి శ్లేషోపమ యిందు రూపకాలంకారమైనది. ఇది శ్రీరామ కవిగారి అలంకారశాస్త్ర పరిజ్ఞానమును వ్యక్తపఱచును.

3. పద ప్రయోగ నైపుణ్యము.

తత్సమపదములను ప్రయోగింపక, తిక్కనవలె, యలతి యలతి తెలుగు పదములతో మూలభావమును వెల్లడి సేయుట యిందు చాలగా గలదు.

మూర్ధ న్యద్రేర్ధాతురాగః తరుషు కిసలయో విద్రుమౌఘః సముద్రే
దిఙ్మాతంగోత్తమాంగే ష్వభినవ నిహితస్సాంద్ర సిందూర రేణుః
సీమ్ని వ్యోమ్నశ్చ హేమ్నస్సుర శిఖరి భువో జాయతే యః ప్రకాశః
శోణిమ్నా సౌ ఖరాంశో రుషసి దిశతు కశ్శర్మశోభైకదేశః. 41 శ్లో.

కొండలయందు జేగురులు, చెట్లకు చిగుళ్ళు, సంద్రమున పగడములు, దిగ్గజమున సిందూరములు-నై మేరుపర్వతమునకు నెఱ్ఱదనము కలిగించు బాల సూర్య కిరణములు మీకు శ్రేయస్సు ప్రసాదించును.

దీనికి వ్యాసమూర్తి శాస్త్రిగారి తెనుగు సేత.

మ. జలధి న్విద్రుమముల్, ద్రుమాళిఁ జివురుల్ శైలంబునం జేవురుల్
బలభిత్కుంభిశిరంబులం దభినవ ప్రత్యగ్ర సిందూర ధూ

ఖలు వింటన్వరు వింటిపైఁడి తళుకుల్ శోణద్యుతిన్ భాను దీ
ప్తిలవంబుల్ వఱువాత నేవలి భవత్ప్రీత్యావహం బయ్యెడిన్.

ఇందు వృత్తము పెద్దది యగుటచే, యతిప్రాసావసర పదప్రయోగము చేయఁబడినది-మూలమున "హేమ్నస్సర శిఖరి" అనగా మేరుపర్వతము-శాస్త్రి గారి తెలుగులో-"హరువింటి పైఁడి తళుకులు" అని కలదు-ఇట హరువిల్లు అనగా మేరువని యర్థము చేసికోవలెను - త్రిపురాసుర సంహారమున మేరువు శివుని విల్లు-పదము ప్రయుక్తమైనపుడు ప్రసిద్ధార్థము వెంటనే స్ఫురింప వలెను-ఇం దట్లులేదు-పాఠకునకు పద్యభావము సుగమము గాదు-శ్రీరామ కవి గారు దీనిలోని భావమును చంపకమాలలో నెంత చక్కఁగా నిమిడ్చినారో చూడుడు.

చ. మలలకు మీఁది జేగురులు, మ్రాఁకులయందుఁ జివుళ్ళు వార్ధి బా
యలఁ బగడంబులున్ దెసల హత్తుల నెత్తులఁ జెందిరంపుఁ బూఁ
తలు దివిమేరుశైలభువిఁ దప్త సువర్ణములైన సూర్య ర
శ్ము లుదయ కాలశోణములు సొంపుల నింపుల మీకు నింపుతన్.

ఇంకొక యుదాహరణ.

"జ్యోత్స్నాంశాకర్ష పాండుద్యుతితిమిరమషీశేషకల్మాష మీష
జ్జృంభోద్భూతేన పింగం సరసిజరజసా సంధ్యయా శోణశోచిః
ప్రాతః ప్రారంభకాలే సకలజగ మివ చ్చిత్ర మున్మీలయంతీ
కాంతిస్తీక్ష్ణత్విషోక్ష్ణాం ముదమపనయతాత్తూలి కేవాతులాం వః.28 శ్లో.

తఱిపి వెన్నెలలోని తెలుపు, మిగిలిన చీకటియందు నలుపు తమ్మిమొగ్గల పుప్పొడి పచ్చవర్ణము - పొడుపు సంజయందలి ఎఱ్ఱ రంగు కలిపి చిత్రము వ్రాయు తూలికవలె నున్న-లేతయెండ మీకు సిరు లిచ్చును.

దీనికి శ్రీరామకవిగారు -

చ. తెల్ల తెలఁ బాఱు వెన్నెలద్యుతిన్ రవచీకటి నల్లనల్లఁగాఁ
బలుచని తమ్మి పుప్పొడిని పచ్చదనంబునఁ బ్రొద్దుపొద్దునం
గలనను గెంపుడాయుల జగంబులఁ జిత్తరువ్రాసినట్టి మే
ల్కల మగు భానుదీప్తి యతుల ప్రమదం బిడు మీఁదు చూడ్కికిన్.

ఇచట చిత్తరువు లేఖనమున్నది గాన దాని యుపకరణము తూలిక - కుంచె మూలమున తూలికా శబ్దమే యున్నది. గాని కవిగారు "కలము" అని వాడినారు. ఇది సరికాదని పైకి తోచవచ్చును కాని సరియైనదే. తూలిక యనగా కలము అను నర్థము గలదు.

సూర్యరాయాంధ్ర నిఘంటువు 3 వ సంపుటము పుట 924.

తూలిక. సం వి. ఆం్స్త్రీ. నా చిత్తరు వ్రాసెడు కుంచె.... 3 వ్రాసెడు కలము.

4. మూలశబ్దానుసరణము.

సూర్యశతకమునందలి మూలభావములను తాత్పర్య రూపమున తెలుగు చేయుటయేకాక నచ్చటచ్చట శబ్దానుసరణము గావించి యున్నారు. మూలమున వృత్త్యనుప్రాసము గల శ్లోకములు గలవు. ఈ యలంకారమును శ్రీరామకవిగారు పాటించియే యున్నారు.

వ్యగ్రైరగ్ర్యగ్రహోడు గ్రసన గురుభరై రోఘ్నే సమగ్రై రుదగ్రై
ప్రత్యగ్రై రీషదుగ్రై రుదయగిరిగతో గోగణై గౌరయన్గామ్
ఉద్గాఢార్చి ర్విలీనామర నగర నగగ్రావ గర్భామివాహ్నే
మగ్రేయోగ్రే విధత్తే గ్లపయతు గహనం సగ్రహ గ్రామణీర్వః. 91శ్లో.

వ్యగ్రము లగ్ర్య సుగ్రహ భహారి గురుల్ సముదగ్రలీలఁ బ్ర
త్యగ్రము లీషదుగ్రములు నౌ నురుగోవుల గోవుగౌరతా
భాగ్రతఁ బ్రాగ్గిరి న్నిలిచి పాల్చి సరాగసురాగగాదినం
బగ్రమునందు జేసెడి గ్రహాగ్రణి మీకగు నగ్రగస్థితిన్.

5. ప్రసన్న రచన.

ఈ సూర్యశతకానువాద మంతయు ప్రసన్న రచన కుదాహరణమే-అయినను, మూలగంభీర భావములను తెనుగువారి కెంత సులభగ్రాహ్యమగునట్లు శ్రీరామకవిగారు రచియించినారో తెలుపుటకు మఱికొన్ని యుదాహరణము లిచ్చుచున్నాను.

## కిరణ వర్ణనము

నోజన్వాన్ జన్మభూమిః నతదురభువో బాంధవాః కౌస్తుభార్యాః
పాణౌ పద్మనయాస్యా నచనరకరిపూరస్థలీ వాసవేశ్మః
తేజోరూపాపరైవ త్రిషు భువనతలే ష్వాదధానాం వ్యవస్థా
సా శ్రీ శ్రేయాంసి దిశ్యాదశిశిరమహసో మండలాగ్రోద్గతా వః

ఉ. పుట్టదు సంద్రమం దచట బుట్టిన కౌస్తుభ ముఖ్యవస్తువుల్
చుట్టలుగావు పద్మమును జూడము చేతుల విష్ణు వక్షమున్
ముట్టదు లాతిదే వెలుఁగు ముజ్జగమందు వ్యవస్థ లేర్పడన్
బుట్టెను మండలాగ్రమునఁ బూషన కా సిరి మీకు మేలిడున్. 48 ప.

## అశ్వ వర్ణనము

ధున్వంతో నీరదాళీః నిజరుచిరచిరాః పార్శ్వయో పక్షతుల్యా
స్తాలూత్తానైః ఖలీనైః ఖచితరుచా శ్యోతతా లోహితేన
ఉడ్డీయేవ వ్రజంతో వియతి జనవశా దర్కవాహా క్రియాసః
క్షేమం హేమాద్రిహృద్యద్రుమశిఖరశిరశ్శ్రేణి శాఖాశుకావః. 49 శ్లో.

చ. తమరుచిచేత పచ్చనగు తట్ల మొగుళ్ళను ఱెక్కలొప్పఁ గ
ళ్ళెములను లాగ నెత్తురులు లేచిన నోళ్ళను ముక్కులొప్ప వ్యో
మమునను దుట్టు మంచు వడిఁ బాఱు సుమేరుశిఖాగచారి కీ
రము లన నొప్పు సూర్యుని గుఱాలు వరాలు సరాలు మీ కిడున్. 49 ప.

## అనూరు వర్ణనము

పౌరస్త్యస్తోయదర్తో పవన ఇవ పతన్ పావకస్యేవ ధూమో
విశ్వస్యేవాదిసర్గః ప్రణవ ఇవ పరం పావనో వేదరాశేః
సంధ్యా నృత్తోత్సవేచ్ఛో రివ మదనరిపు ర్నంది నాందీనినాదః
సౌరస్యాగ్రేసుఖం తో వితరతు వినతానందన స్యందనస్య. 55 శ్లో.

ఉ. వానకుఁ దూర్పుగాలివలెఁ బావకకీలకు ధూమమట్లు లో
కానకు నాదిసృష్టి గతిగా శ్రుతిరాశికి నోంకృతి స్థితిన్
భానుని గ్రుంకునందు నటనం బిడు శూలికి నంది నాందిగా
నై నళినాప్తు తే ర్నడపు నవ్వినతాత్మజుఁ డేలు మిమ్ములన్. 55 ప.

## ర థ వ ర్ణ న ము

నంతుంనా కాలయానా మనిశ ముపయతాం పద్ధతిః పంక్తిరేవ
క్షోదో నక్షత్రరాశే రకృశరయమిళ చ్చక్రపిష్టస్య ధూళిః
హేషాహ్రాదో హరీణాం సురశిఖరిదరీః పూరయ న్నేమినాదో
యస్యావాత్తీవ్రథానో స దివి భువి యథా వ్యక్తచిహ్నో రథో వః. 69శ్లో.

ఉ. క్రొక్కగవచ్చు దేవగణముఖ్యుల దాలది త్రోవ గాఁగ నా
చుక్కలు చక్రఘట్టనను జూర్ణముగా నది దుమ్ము గాఁగ బల్
నెక్కొను వాజిహేష దివి నిండిన నేమి రవంబు గాఁగ మి
న్న ఖుక్కతలంబు బోలఁగ నొనర్చిన యర్కురథంబు మీ కగున్. 69ప.

## మ ం డ ల వ ర్ణ న ము

చక్షుర్దక్ష ద్విషోయం న తు దహతి పరం పూరయత్యేవ కామం
నాస్తం జుష్టం మరుద్భిర్యదిహ నియమినా యానపాత్రం భవాబ్ధే
య ద్వీతక్రాంతి శశ్వత్ భ్రమతి జగతాం భ్రాంతిమత్ భ్రాంతిహన్త్రి
బ్రధ్నస్యావ్యా ద్విరుద్ధక్రియ మపి విహితాధాయి తన్మండలం వః. 80శ్లో.

చ. పురహరునేత్ర మయ్యు నెఱపు న్నిరవద్యతఁ గామపూర్తి సం
సరణ సముద్రనావ యయి జౌకదు గాలికి నెల్ల వేళలం
దిరిగియు న్భ్రమంబు జగతిం భ్రమనాశి విరుద్ధకార్యమై
సరసము సూర్యమండలము శాశ్వతసౌఖ్యము మీకు నిచ్చుతన్. 60 ప.

## ర వి వ ర్ణ న ము

దేవః కిం బాంధవస్స్యాత్ ప్రియ సుహృదథవాచార్య ఆహోస్విదర్యో
రక్షా చక్షుర్నిదీపో గురుయుత జనకం జీవితం బీజమోజః
ఏవం నిర్ణీయతే యః కి మపి న జగతాం సర్వదా సర్వదోసౌ
సర్వాకారోపకారీ దిశతు దశశతాభీశు రభ్యర్హితం వః. 100 శ్లో.

ఉ. చుట్టము పక్కముం గురువు చూపును గాపును జ్ఞాతి జ్యోతియున్
పట్టగు ప్రాణదాతయును భ్రాతయు తల్లియుఁ దండ్రియున్ సదా
పెట్టని కోటయై సకల పృథ్వికి నన్నము నీళ్ళు నిచ్చుచున్
దిట్టవు వెల్గులం దనరు దేవుడు మీ కిదు వాంఛితంబులన్. 100 ప.

పై యుదాహృతుల వలన శ్రీరామకవిగా రెంత తెనుగుదనముతో దీని ననువదించిరో తెలియగలదు.

## యతి, పద ప్రయోగములు

శ్రీరామకవిగారు మహాకవులే గాక, ప్రాచీన మహాకావ్యలక్ష్య లక్షణ పరిజ్ఞానము గల మహావిద్వాంసులు. వారి దేవీభాగవత పీఠికలో, వ్యాకరణచ్ఛందో విశేషముల నెన్నింటినో వివరించినారు.

## యతులు

ఇందు వా రుపయోగించిన కొన్ని యతులు చూడుడు.

జ్ఞ - క యతి - కనురుచివంటి భాస్కరుడు జ్ఞానదయాదుల మీకు నిచ్చుతన్. 24 ప.

మ - వ యతి - దీవుల వెలిగించు దీపము మిమున్ రవిదీప్తి సుఖింపఁజేయుతన్ 28 ప.

మహిమ దహించు నర్యముని వార్వపుబంతి శుభంబు మీకిడున్ 47 ప.

## ద్వారశబ్దమున కచ్చుతో యతి.

అప్పకవీయమున నొకటే యుదాహరణ మీయబడినది.

"ద్వారమునం దడంగ నరుణాఖ్యుఁ డదల్చిన. 48 ప.

"అమరిన పెద్ద చక్కలకు ద్వారనగంబులు." 70 ప.

## పదములు

1. ధోరము — ప్రా. తెలుగుతోరము - శ్రీరామకవిగారు ప్రాకృత పదమునే వాడినారు. 'కంకణధోరము గట్టి' 47 ప.

2. జలిది — జల్దీ — అన్యదేశ్యము — త్వరగా.
"ఛలో ఛలో జలిది" 61 ప.

3. సుధాభుక్కులు — సుధా భుక్కులు - అని వ్రాసె.
పదస్వరూప నిర్ధారణ. 64 ప.

4. ప్రప్రీతుఁడు - ఉపసర్గ సంవిధానము - ఉపసర్గ సంవిధానము శ్రీనాథు నికి మాత్రమే గలదు. తిరిగి శ్రీరామకవిగారికి మాత్రమే గలదు. అందువలననే చెళ్ళపిళ్ళవారు శ్రీరామకవిగారిని "అపర శ్రీనాథుడు" అని ప్రశంసించినారు.

## మూలము — వివరణ

సంస్కృత సూర్యశతకమున నూఱు శ్లోకములు గలవు. అవి అన్నియు స్రగ్ధరావృత్తములు.

ఈ శతకమున : కిరణవర్ణనము 43, అశ్వవర్ణనము 6, అనూరు వర్ణనము 12, రథవర్ణనము 11, మండలవర్ణనము 8, సూర్యవర్ణనము 20 శ్లోకములు గలవు.

ఈ స్రగ్ధరావృత్తము లన్నియు, ఆశీస్సు అంతముగా గలవి. అనగా ప్రతి శ్లోకమును మీకు శ్రేయము ప్రసాదించుగాత ! అన్న ఆశీస్సుతో ముగియును. ఇందువలన తెలుగుపద్యములును ఆశీస్సులతో నుండును.

ఇంకను చెప్పవలసిన వనేకము లున్నను గ్రంథవిస్తరభీతిని విరమించితిని.

శ్రీరామకవిగారి సూర్యశతకానువాదము తెలుగుసీమలో వ్యాప్తిని బడయు గాక !

- నిడుదవోలు వేంకటరావు

శ్రీరస్తు

శ్రీ సూర్యనారాయణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ సూర్య శతకము

## :: అవతారిక ::

ఉ. శ్రీపతి శాంకరీపతి శచీపతి వాక్పతి నాకలోక సే
నాపతి సుస్వధాపతి వనాటపతి ప్రతికూలకార్య వా
ర్తాపతి గూఢపాత్పతి పతంగపతి ప్రముఖాఖిలైక ర
క్షాపతుల న్మదిం గని త్విషాంపతిఁ బ్రస్తుతి సేయఁబూనితిన్. 1

చ. కలుగు తెలుంగుకబ్బములు కట్టడిమందలు మంద లిన్ని వం
దలను గణింప శక్య మగునా ? యిక నందుల కేమి యందులో
లలితపదార్థవిస్ఫురణలం దనియించు పరోపకార మా
న్యులు పదివేల కొక్కఁడుగ నుండును పాత్రులు వారు ప్రస్తుతిన్. 2

శా. ఔరా ! నోరు రసంబు లూరు పద మాహా ! కోటికిన్ తీరు మ
జ్జారే ! రచ్చలఁ జేరుఁ జేరనుచు నిచ్చ ల్పామరు ల్మెచ్చఁగాఁ
దా రింతేనియు సిగ్గులేక గణికాతండంబులం బోలె పల్
దారుల్ ద్రొక్కి పదార్థముల్ గొను కవుల్ పాత్రుల్గదా నిందకున్. 3

చ. విలసిత సాహితీవిమలవృక్షముకొమ్మ మయూరనామ సం
కులసరఘాళి శుద్ధపదగుంభ సుమాసవ మేల్చు చేర్చినన్
కలయఁగఁ గట్టు సూర్యశతకం బను కండెను దాసు రాముఁడన్
తెలుఁగునఁ గొట్టి కమ్మనగు తేనియఁ దీసితి దీనిఁ గ్రోలుఁడీ ! 4

చ. మును భువి నెంద ఱెందఱు కవుల్ విపులార్థము లెన్ని యెన్ని క
ల్పనములు నాఁట నాఁట నిరపాయమతిన్ రచియించి మించి ర
య్యనుపమ పాండితీచతురులం దొకసాటికిఁ బేటి కంచుఁ గా
కనియెద నే నిహార్థము పరార్థము భాస్వదనుగ్రహార్థమున్. ౫

# సూర్య శతకము

## కిరణ వర్ణనము

శా. జేజేరాయని కుంభికుంభగతమౌ సిందూరముల్ తాల్చియో
యోజం జేగురువాగు లయ్యుదయశైలోపాంతమం దంటియో
రాజీవప్రభ లేకకాలమునఁ బ్రారంభించియో యెఱ్ఱనై
తేజుల్ చిమ్ము నవార్కభాను లిడు నెంతే మీకు నైశ్వర్యముల్.

తా. తూర్పు దిక్కున కధిపతియగు నింద్రుని యైరావత కుంభములకు పూసిన సిందూరము వలెను, ఉదయ పర్వతము నుండి కారుచున్న జేగురు ధారల రీతిని, తామరపూవుల నూతన కాంతిని ఎఱ్ఱనైన సూర్యకిరణములు మీకు సిరులు నొసగు గాత- 1

ఉ. తామరమొగ్గ పెన్గొలఁదుఁ దప్పని లక్ష్మిని భక్తకోటికిన్
బ్రేమ నొసంగు లాగఁ దలపెట్టియొ తద్వని ముట్టడించుచున్
భీమతమంబునం దగిలి భీతిలు లోకముఁ బ్రోవ జాణలౌ
కోమల పల్లవాభ రవిగోనిచయంబులు మీకు మే లిడున్.

తా. ముకుళించుకొని యున్న తామరమొగ్గలలోని లక్ష్మిని లోకమున కందించు తలంపున కటిక చీకటిని చీల్చుచు, ఆ లక్ష్మిని మానవుల కందించుచు, కోమలములై ఎఱ్ఱనైన చిగురుల బోలిన సూర్యప్రభలు మీకు శోభనము లొసగూర్చు గాత - 2

ఉ. కోమలపద్మగర్భములఁ గొండల శాతశిఖాళి నొక్కమై
మైమును బ్రొద్దుజోల మునుమాపుల వ్రాలి యొకించుకేని వి
శ్రామము లేక ముజ్జగముశాల నటించి సదా పథశ్రమో
ద్దామత నా, మహోష్ణమము దాల్చు రవిప్రభ లేలు మిమ్ములన్.

తా. ప్రొద్దున, సాయంతనమున—మృదువైన పద్మ గర్భముల యందు కఠినమైన కొండ శిఖరములయందును, సమముగా నిల్చుచు విశ్రాంతి లేక, మూఁడు జగంబులను పర్యటించు, సూర్యకిరణ కాంతులు మిమ్ము కాపాడు గాత. 3

చ. తమ మను పైదుకూలములు తప్పి యనావృతమైన జంతు బృం
దము గని భాస్కరుండు గరతంతుల సాచినఁ దత్క్షణంబ ద
ట్టమయి క్రమక్రమంబున స్ఫుటంబయి దిగ్దళకంబు పేరి మ
గ్గములను నిండు క్రొమ్మడుఁ గకల్మష మీవుత మీకు
భద్రముల్.

తా. చీకటి యనెడి బట్ట తొలగిపోగానే జంతువులను కరుణించి తన కిరణములను తంతువులచే, క్రొత్త బట్టలను కల్పింపజేసి, దశదశలను మగ్గములను, తమకాంతిని నిండించిన బాలభానులు మీకు శుభంబు లిచ్చుగాత- 4

చ. పతిరుచి దూలిన న్వొగిలి వాడిన యోషధి పిండు దెప్పున
ట్లతులిత సూర్యకాంతశిఖి, యాది నెదుర్కొన లేచినట్లు ప్రాక్
క్షితి భృతు ఱాల్ల పక్షవినికృంతన నెత్రులుగాఁ జూపు న
ట్లతనుత నెక్కు నర్కునరుణాంశులు మీకును గీడు వాపుతన్.

తా. చంద్రు దస్తంగతుడు కాగా, ఓషధీసతి కళ తగ్గిపోగా సూర్య కాంతములయం దగ్ని స్వాగతమీయగా, మేరుపర్వతము రెక్కలు ఖండించి నపుడు కారునెత్తురు వలె, నెఱ్ఱనైన యర్కుని కిరణములు మీకభ్యుదయము నిచ్చుగాత- 5

ఉ. ముక్కుఁడి గుంటు మొండి వ్రణి మూలుఁగు వానిని దోషకారి నే
యొక్కఁడు సక్కనేయుఁ దెవులోఁటిచి తక్కక యట్టి సద్దయా
దృక్కలితార్కు సిద్ధగణ దృష్టమహార్ఘ్యములైన యంశువుల్
గ్రక్కున మీ దొసంగులు విఘాతములై చనఁజేయుఁ
గావుతన్.

తా కాళ్ళు, చేతులు, ముక్కు తెగి, మూలుగుచున్న రోగిని తా నొక్కఁడే తనకిరణములచే చక్కఁజేయు కరుణాకరుండగు కంజహితుడు మీకు భద్రములు చేకూర్చుగాత-

ఇచ్చట సూర్యకిరణ ప్రసారము వలన కుష్ఠరోగము నిర్మూలమగుట సూచితము. సూర్యశతకకర్త యగు మయూరుడు కుష్ఠవ్యాధి బాధితుడై సూర్యస్తుతి చేసి నిరామయుడయ్యెను. నేఁడును కుష్ఠరోగములకు, సూర్యకిరణ చికిత్సతప్ప వేఱు చికిత్స లేదు. 6

చ. తొలుతను గుజ్జులై పిదప దొడ్డయి యాదట ఘనభోంత రా
కలితములై యనంతరము గ్రక్కున దిగ్దశకంబు ముట్టి య
బ్బలిదనుజేంద్రు నంటి యల ధ్వాంతము విశ్వమునుండి వాపి శ్రీ
చెలువుని దెప్పు నర్యముని చేతులు మీ దొసఁగుల్
హరించుతన్.

తా. మొట్టమొదట పొట్టివియై, క్రమముగా పొడుగై ఆవెనుక నాకాశము నాక్రమించి, దశదిశలు నిండి, ఆనాడు బలిచక్రవర్తిని నడగద్రొక్కిన త్రివిక్రముడగు విష్ణుమూర్తి వలె వ్యాపించిన సూర్యుని కరములు మీ పాపములను బాపుగాత- 7

చ. అరుణుని కెంపుచాయల మహారుణిమన్ బహుళంబు చేసి య
య్యరదపు గుఱ్ఱముల్ మొగము లలన నెత్తిన నోళ్ల గళ్ళెపుం
గఱపుల రక్తరోచులయి గట్లకుఁ గూటము లంటనెక్కఁ శే
ఖరతను గాంచి రేపు దివిఁ గ్రాలు నినప్రభ మీకు మేలిడున్.

తా. అరుణుని కెంపుచాయలకు నెక్కుడుశోభ గల్పించి, రథమునకు గట్టిన గుఱ్ఱములనోళ్ళ నున్న కళ్లెములవలన దవడల చివరలు తెగి రక్తము వలె, నెఱ్ఱనై ఆకాశ వీథి విహరించు సూర్యాంశువులు మీకు సుఖ మిచ్చుగాత- 8

ఉ. కాలమునం బయస్సులనుఁ గాంచి యొసంగి ప్రజాసుఖంబిడన్
జాలఁ జరించు ప్రొద్దుట నిశ న్విరమించును దీర్ఘదుఃఖ జం
బాల భవాబ్ధి కోడలుసుమా రవి గోవులు భవ్యపావన
త్వాలఘు లవ్వి మీకుఁ బరమాధికతుష్టిని, బుష్టి నిచ్చుతన్.

తా. ప్రొద్దుటనే పాలనిచ్చి,ఆవెనుక దిక్కులకు మేతకై పోయి సాయం కాలము కాగానే, ఇల్లు చేరు గోవుల వలె, తెల్లవారగనే చైతన్యమును కలిగించి, సాయంకాలము వఱకు లోకమునకు శోభకలిగించి, సంసారసముద్రమును దాటుటకు నావలైన సూర్యుని గోవులు (కిరణములు) మీకు భద్ర మిడుగాక.

సంస్కృతమున గోశబ్దమునకు ఆవు అని, కిరణమని రెండర్థములు గలవు. 9

ఉ. చేతులు మోడ్చి యొౌదలలఁ జేర్చి త్రిసంధ్యల మ్రొక్కువారి క
త్యాతత బంధమోక్షకరణాధిక బోధము నంబుజాళిఁ బ్ర
ఖ్యాతము సేయు నాఁ బరగు కల్మషభేదులు సూర్య నంశువుల్
ప్రీతిని నిర్వికల్పముగ మీ మది కోరికలిచ్చు గావుతన్.

తా. సంసార బంధములను తొలిగించి మోక్షమునకు మార్గము చూపుచు, పాపములను సంహరించు సూర్యకాంతులు ప్రాతః కాలముననే స్నానము చేసి, సూర్యునికి మ్రొక్కువారికి నెల్లప్పుడు నుల్లాసము గల్పించును. 10

ఉ. లేవడిఁ బైఁడి సోనలు, లలిం బతనంబునఁ జేతికబ్బ లా
త్మావగమంబు దివ్వె సురధామము బోవను బెద్దదార్లు మో
క్షావసనార్థికిం దనువు ద్వారము సొన్పెడి మంచి బెత్తముల్
ప్రోవను ప్రాతరర్కసుఖరోచులు దుర్వ్యధనుండి మిమ్మలన్.

తా. బీదతనముచే కృశించువారికి బంగారము కురియించుటకు హేతువులై, స్వర్గధామము చేరుటకు రహదారులై, కామ క్రోధాదులను జయించి తపస్సు చేయు యోగులకు ముక్తిద్వారమునకు వేత్రహస్తులైన ప్రాతః కాల భానుకాంతులు మీకు భాగ్యదము లగుగాక. 11

చ. మునుమును తూర్పుకొండఁ దుద ముద్దుల కల్కితురాయి
మానికం
బనఁగ దిశాసతీమణుల కందపు పూఁతకు రోచనాంబు చ
ర్చన లన నొప్పి మక్కువల జక్కవ లార్చెడి వాఁడిచూపు ట
ర్చనలను గాంచు బాలరవిరశ్ములు మీకిడుఁ జింతితార్థముల్.

తా. తూర్పు కొండకు మాణిక్యమై, ఆకాశగంగలో స్నానమాడు సంగల చూపులకు నాసేచనకములై. సమస్తలోకము నర్చించు సూర్యకరములు మీకు శోభగల్గించుగాత- 12

చ. వెలుఁ గొకడే కనుంగవయి, పేర్చు జగత్త్రియి,నల్వనాల్గుమో
ముల సుతికెక్కి పంచమసుభూతమునాఁ దగి యాఱుకార్ల ని
చ్చలు పలురీతుల న్నెగడి సప్తమునిస్తుతి నష్టదిగ్గతిన్
బొలయు నవార్కదీధితులు సూఱుపదుల్ శుభశోభ
మీ కిడున్.

తా. ఒక్కటే ప్రకటమై, రెండు కన్నులకు చూపుల నిచ్చుచు మూడు జగములు నింపి, నాలుగుమోముల నలువ స్తుతికి పాత్రమై, అయిదు భూతముల వ్యాపించి, ఆఱుఋతువుల గలిగించి ఏడుగురు ఋషులచేతను పొగడ్తల నంది, ఎనిమిది దిక్కుల తొమ్మిది (నవ) కాంతులతో వెలయు పదినూఱుల కిరణములు మీకు సందల నింపు గాక—

ఇందు సంఖ్యాలంకారము కలదు. 18

చ. బడిబడి విశ్వముం దిరుగఁ బల్ శ్రమ దట్టిన యట్లు స్వోష్మచేఁ
బడలిన యట్లు గ్రీష్మదవవహ్ని వేగిన యట్లు మాటికిన్
బుడమి జలంబు ద్రావి జడి పూటలు జల్లులుగొట్టి తోయముల్
వెడలి హిమార్తమౌ రవి యభీశుచయం బిడు మీకు
భద్రముల్.

తా. వేసవిలో బాటసారివలె, దాహముచే సముద్రోదకములన్నియు త్రావి, ఆ నీటిని తిరిగి, వర్షరూపమున భూమిపై ప్రవహింపజేసి, ఆ నీటి శైత్యముచేత, హేమంతఋతువును గల్పించు, సూర్యాంశువులు మీకు శోభాయమానము లగుగాక- 14

చ. కలయ దిశావధూటులకుఁ గన్నులపండువుగాఁగ నస్ఫుటో
త్కలనను నూగునూగు లెఱ దాశువు సొంపుల నింప నుల్లస
న్నళినవిలోచనం బగు దినంబు మొగంబున మొల్చినట్టి మీ
సల నునురేకఁ బోలు దివసప్రభునంశులు మీకు మేలిడున్.

తా. దిక్కులనెడి స్త్రీలకు కన్నుల పండుగగా, దినము మొదల నూనూగుకాంతులతో మొల్చు కిరణములను నూనూగు మీసాలవలె నలరింపజేయు నర్కుని బాలభానులు మీకు ప్రతిపత్తి కలిగించుగాక- 15

చ. తల నెలబాలుఁ డాలుగొనఁ దక్కు నితం డని శూలి నూతనా
కలిత సరోజగహ్వరసుఖస్థితికిన్ విధి చిమ్మచీఁకటుల్
వలె నలుపైన మేనికగు బాధకు భీతిలి కృష్ణదేవుఁడున్
గొలుచు దినేశ సద్రుచుల క్రొమ్మెఱుఁగుల్ మిముఁ బ్రోచు
గావుతన్.

తా. ఏ సూర్యు డుదయించిన, తనతలపై నున్న చంద్రుడు కాంతి తఱిగి పోవునని శివుడు భావించుచున్నాడో. ఎవని కిరణములచేత తానున్న తామర పూవు గద్దె కదలిపోవునని, బ్రహ్మ భయపడుచున్నాడో, నల్లనిచీకటి అంతయు పోయినందున, నల్లని తనశరీర మేమగునో యని, కృష్ణుడు భ్రాంతిజెందు చున్నాడో, అట్టిసూర్యుని నూతన కరములు సంతసము కలిగించును గాక- 16

ఉ. కొండకు విర్వియున్ దెసలకు న్నిదివంబులు వేలవేలుగా
నుండుట వార్ధికిం గలుగ నుర్వినిఁ జెట్టులు వీండ్లు గట్టులున్
మెండుగఁ దోపఁ జీఁకటిని నెట్టి జగన్నిశిసీప్రబోధమున్
నిండుగ సల్పు బాలతరణిప్రభ మీకును గీడు వాపుతన్.

తా. సమస్త భూప్రపంచమున గల, కొండలు, నదులు, నగరములు, ఏఱులు, సరస్సులు, వృక్షములు, గుట్టలు, పుట్టలు, ప్రకాశమానమైనట్లుగా చేసి, జగమనెడు పద్మమునకు నవ్యవికాసము గలిగించు, తరణిప్రభ మిమ్ము ధన్యులుగా చేయు గాక— 17

శా. అస్తవ్యస్తుఁడు గాక నైజరుచియై యానంత్యముం గల్గి సం
గ్రస్త ధ్వాంతత విశ్వధామమున నేకత్రస్థ దీపంబు నా
నస్తోకంబుగ ముజ్జగాన దిగ నేహాపేక్ష నిత్య క్రియా
శస్తిం గ్రుమ్మఱు ప్రాజ్ఞవాక్కిరణోచ్చైః కాంతి మే
ల్మికగున్.

తా. అస్తవ్యస్తముగాక, ఏకాకారముగా, నిజకాంతులచే, అనంతమై చీకటి నెల్ల పోగొట్టి బ్రహ్మాండగేహమునకు నేకైకదీప మైన సూర్యకిరణాళి మీ కుచ్చైఃస్థితి గల్గించుగాక - 18

ఉ. వాడును డూఁడువంటి యహివర్గ మయో యని నాగలోకమున్
గూడక చక్రవాళమునకుం గల యాఖ్యకు నంచుఁ బ్రక్కలన్
వేఁడిమి యాకజాండమునఁ బెంకులు ప్రేలు నటంచు మింటిపై
నాడక స్వేచ్ఛఁ బోవ బయలైన యినప్రభ లేలు మిమ్ములన్.

తా. నాగలోకము వాడిపోవు నని పాతాళము చొరక చక్రములకు వేడిమి చూపక, బ్రహ్మాండకర్పరము పగులునో యని, మఱి ఊర్ధ్వముఖముగా వ్యాపించక, స్వేచ్ఛగా సంచరించు, సహస్రాంశుని అంశువులు మీ కానంద మిచ్చుగాక- 19

ఉ. కాలమెఱుకం డెకాదట జగంబును నీలిమఁబాయఁ జీకటుల్
వ్రీలఁగ మంచుకొండవలె రేవెలుఁగు న్విలయంబు నొంద సి
ద్ధాళికిఁ గేలు మోడ్పులటు లక్కుముదప్రకరంబు బద్ధతన్
గ్రాల నొనర్చు ప్రాతరరుణప్రభ మీకును గోర్కెలిచ్చుతన్.

తా. ప్రతిదినము జగంబున గల చీకటుల మాయజేసి మంచుకొండ వలె చంద్రుని నిలువజేసి, తన్నుగూర్చి చేతులుమోడ్చి స్తుతించు సిద్ధాళికి ముద మును గూర్చు పగటివెలుగఁజేని కాంతి - మీ కోర్కె లీడేర్చుగాక. 20

ఉ. తామరపూలదా ల్గొనక తద్దయుఁ బెంచును తారకాళి నెం
తేమటుమాయఁ గప్పు వెస నెప్డు దినంబు నిమేషమాత్రఁగా
నేమియుఁ జాల దట్టి విపరీత జగత్త్రితయైకచక్షువౌ
గాములఁజేనితేజ ఘనఘత్వము మీకు ఘటించుఁగావుతన్.

తా. తెల్లనైన తామరపూవులకాంతి హరింపకయే చుక్కలకు మిక్కిలి శోభ కల్గించును. నిమేషములో చీకటినంతయు మాయజేయును. లోకత్రయ చక్షువైన ఆ సూర్యుని మహాతేజము మీ కుద్దీపనము గల్గించుగాక. 21

చ. ఇగమున చల్లనౌస్థలుల కెక్కెడు వేడుకనో వసుంధరన్
దిగిభకరాగ్రపుష్కరతతిన్ విరియింపనో దిక్కదంబమున్
మొగి హరిపాదముం గడచి ప్రొద్దుట సత్కృపనో
సుదూరమున్
దగఁ ద్రుటిలో నలర్చు రవిధామము వాపును మీకు దుర్దశల్.

తా. చల్లదనముకొఱకు, శీతలస్థలుల చేరు వేడుకతోనో దిక్కుం జరముల తొండముల బిల్చు నీటిని నాసించియో యా పాతాళలోకమువఱకు గల దిక్కుల నన్నింటిని త్రుటికాలములో గమించు తోయజబంధుడు, మీ బంధము లను సడలించుగాక. 22

చ. ప్రళయముననన్ మలల్ విఱచు ఱాడతిగాలికి నాఱిపోవ దు
జ్జ్వల మహనీయ కాంతిమయి పట్టపగల్ వెలుఁగొందు వీత క
జ్జలము పతంగసంభవ మజస్ర మఖండము వర్తి యేదు దీ
వుల వెలిఁగించు దీపము మిమున్ రవిదీప్తి సుగింపఁ
జేయుతన్. ౨౩

తా. ప్రళయకాలమున కొండలను పిండిచేయు గాలికి నారిపోవదు. ఉజ్జ్వలమైన కాంతిచే పగలంతయు వెలుగును. పతంగ సంభవమై, అఖండమై, వర్తిరేకయే సమస్త దీపులను వెలిగించు దీపమగు రవిదీప్తి మిమ్ము విరాజిల్ల జేయుగాక. 23

చ. మొనయుచు నాశలెల్లఁ దుదముట్టెడి శ్లాఘ్యగుణాళి గౌరవం
బును నుదయాద్యహోగమ సమున్నతిఁ బర్యవసాన వర్జితం
బును గలదై క్షణంబునుఁ దమో నిచయంబునుఁ జేరఁబోక మే
ల్గనురుచివంటి భానురుచి జ్ఞాన దయాదులు మీకు నిచ్చుతన్.

తా. ప్రొద్దుటనుండి బయలుదేరి ఒకేరీతిగా దిక్కులన్నింటిని వెలిగించుచు, ముగింపు అనునది లేకుండ అందరు పొగడదగినటువంటి గుణ గౌరవముచే నొప్పుచు, క్షణమాత్రమున చీకటినెల్ల హరించు సూర్యకాంతి మీకు జ్ఞాన దయాదుల నిచ్చుగాక. 24

చ. ప్రశమితతారకోర్జితబలం బగు శక్తినిఁ దాల్చి చంద్రకాం
త శిఖి నడంచి యయ్యతనుదర్పత మోహరవిస్ఫుర న్మహో
తిశయిని యైన వీక్షణరతిం దగి రెండవ క్రౌంచభేది నాఁ
గుశలతఁ గాంచు భానురుచికుట్టి యొసంగుత మీకు లక్ష్ములన్.

తా. ఇందు సూర్యతేజము కుమారస్వామితో పోల్పబడినది. కుమారస్వామి తారకాసురుని నణచినట్లు సూర్యకాంతి తారకల (చుక్కల) నణచును. చంద్రకాంతముల కాంతిని కుమారస్వామి ధిక్కరించును. సూర్యుడు చంద్రకాంతముల కాంతి తగ్గించును. ఈ రీతిగా సూర్యతేజస్సు కుమారస్వామిని పోలియున్నది. 25

చ. తెలతెలఁ బాఱు వెన్నెలద్యుతిన్ రవచీఁకటి నల్లనల్లఁగాఁ
బలుచని తమ్మిపుప్పొడినిఁ బచ్చదనంబుల ప్రొద్దుపొద్దునం
గలననుఁ గెంపుచాయల జగం బను జిత్తరు వ్రాసినట్టి మే
ల్కలమగు భానుదీప్తి యతులప్రమదం బిడు మీదు
చూడ్కికిన్.

తా. తెలతెలవారగా జాఱిపోవుచున్న వెన్నెలల తెలుపు రంగును, అప్పుడే పీడుచున్న చీకటి నలుపు రంగును, పద్మముల పుప్పొడి యందలి పసుపు రంగును, ప్రాతఃకాలమున గనుపట్టు, సూర్యకిరణముల ఎఱుపు రంగును, కలిపి జగమనెడు చిత్రరువును చిత్రించెడితూలికవలె నొప్పు బాల సూర్యకాంతి మీకు మేలొనగూర్చుత. 26

ఉ. మేరునగంబుమార్గమున మించిన కెంపులధూళి లేచెనో
తేరునఁ దీర్చు పొంకముగ దిద్దిన యెఱ్ఱని వైజయంతియో
స్వారిగుఱాలు మేల్త్రాగరుచాయల జూల్కదలించునో యటం
చారయ నొప్పు బాలతపనాంశులు దోఁచుత మీకుఁ బాపముల్.

తా. మేరునగమునందలి కెంపులధూళిచేతనో రథమునకు గల ఎఱ్ఱని పతాకముననో, స్వారి గుఱ్ఱముల నెఱ్ఱని కాంతుల వలననో ఎఱ్ఱనైన ప్రొద్దుటి సూర్యకాంతులు మీకు శోభకలిగించుత. 27

ఉ. చీఁకటిఁ బుచ్చు వేడిమినిఁ జేయదు వెల్తురు నిచ్చు బెద్ద రూ
పై కనరాదు రే నడచునంతఁ బగ ల్వెలిగింపఁబోదు ప్రా
భాకర మైన బాలరుచిపాళియ పూర్ణము దిఙ్నభోవకా
శాకలితంబె మీకు సకలార్థములన్ ఘటియించుఁ గావుతన్.

తా. చీకటిని ప్రోదోలును-అయినను, వేడిచేయదు, కావలసిన వెలుగును నిచ్చును. అట్లని పెద్ద ఆకారముతో నుండదు. రాత్రి నడచియు, పగలు వెలిగింపదు. ఆకాశము భూమియు, సమస్తమును వ్యాపించు, బాలసూర్యకాంతులు మీకు శ్రేయస్సు ఘటించు గాక. 28

చ. చుఱుకయి శాంతిదంబు నలుసు న్విపులంబయి కానరాక యొ
క్కరికివి కానవచ్చియు జగంబున సిందున నుండి యందునున్
వఱలును నశ్వరంబయి యనశ్వరమౌ మునివేద్య మెల్లవా
రెఱిఁగియు నట్టి లోవెలుఁగు రెంటి యినప్రభ మిమ్ము
నేలుతన్.

తా. సూర్యుని వేడిమి తీవ్రముగ నుండియు, కాంతి నిచ్చును. అణువు వలె చిన్నదిగ నుండియు, మహావిపులమైనది. అది-అందటికి-కనబడును గాని, ఆయనదరికి, మనము పోలేము. ఇక్కడ, అక్కడ-అనుమాట లేక, సర్వమును ప్రకాశింప జేయునదియై, మునీశ్వరులకు మాత్రమే గమ్యమైన, బాలసూర్య కాంతి మీకు మేలుచేయుగాక. 29

ఉ. సొమ్ములు గాగ రత్నములు జొప్పడు గూర్చును గాఱుచి చ్చర
ణ్యమ్ములు గాల్పఁ జందురుఁడు "హా యిని" దేల్పఁగ జేసి
మూఁడు లో
కమ్ముల భూష యై వెస నఘమ్ములు దోలుచు వాన నిచ్చి సౌ
ఖ్య మ్మిడి పెక్కు కర్జముల కర్తృ యినప్రభ మిమ్ముఁ
బ్రోవుతన్.

తా. సూర్యు డొక్కడే యయ్యు ననేకకార్యములు సాధించును-రత్నములు నగలకు కూర్చునపుడు వానిని వెలిగించును. కారుచిచ్చును కల్పించి యరణ్యములు కాల్పించును-చంద్రునకు హాయిగల్పించును. లోకమునకంతకు నేకైకమైన యలంకారముగా భాసిల్లును-సరియైన కాలమున వానలు కురియించును. అట్టి సూర్యకాంతి మీకు భద్రము నిచ్చును. 30

మ. కనుత్రాలన్ శ్రుతిత్రాన్పడన్ రసన నాకంటోక ముక్కొద్దియు
న్గన కాత్వక్కు స్పృశింప కుల్లము నడంగన్ శ్వాసమొక్కండు ద
క్కను వేఱొక్కటి లేక తూలిపడు నక్కాలాహి సందష్టమౌ
జనమున్ లేపెడి వెజ్జు బాలరవితేజం బార్చు మీ యాపదల్.

తా. కనులు కనబడక, చెవులు వినబడక, నాలుక మెద్దువోవ, ముక్కు చదియగా శరీరము స్పర్శతక్కియుండి, ఊపిరి యొక్కటే నిలిచి, కాల సర్పముచే కఱువబడిన ప్రాణిలోకమునకు ఆ రోగము పోగొట్టి, చైతన్యమిచ్చు సూర్యదీప్తి మీకు తేజస్సు గలిగించు గాక. 31

శా. కన్నీర్వంటి హిమంబునెల్ల వెసఁ దగ్గంజేసి యింతింతగాఁ
గన్నిండౌ నెఱుపున్ హరించి బలు జోకం బేర్చు నిర్దోషతన్

విన్నాణంబుగఁ జూడఁజేసి భువనప్రేక్షం ద్వదాపత్తి వి
చ్ఛిన్నంబు న్సలుపు న్నవార్కరుచుల న్సిద్ధాంజనప్రక్రియన్.

తా. కన్నీటివంటి మంచును తగ్గజేసి కన్నులలో గలుగు నెఱుపును హరింపజేసి, ఏ దోషములు లేకుండ భువనములను చక్కగా జూచుచు, సవిచ్ఛిన్నముగా సంచరించు సూర్యకాంతులు మీకు శోభను గూర్చుగాత. 32

ఉ. ప్రొద్దుదయించు దిక్కననుఁ బుట్టి నెలం గడుఁ దూల్చి యెఱ్ఱఁగా
దిద్దినయట్లు తోచి గడిదేఱు నవాబ్జము నట్టె లేపుచున్
దద్దయు ముజ్జగంబులకు దా రొక సొమ్ములుగాఁ దలిర్చుచున్
ముద్దులుగుల్కు భానుకరముల్ విభవంబులు మీకుఁ జేయుతన్.

తా. ప్రొద్దుదిక్కున నుదయించి, చంద్రకాంతిని తగ్గించి, ఎఱ్ఱ యెఱ్ఱగా నొప్పుచున్న క్రొత్తతామరకు కమనీయత గల్పించి, మూడులోకములకు నెవడు భూషాయమాణు డగుచున్నాడో, అట్టి సూర్యుని కిరణములు మీపాపములు బాపుగాత. 33

చ. పొలుపుగ ముజ్జగంబు లను పూవులతోఁటను బెంచు రాత్రి యన్
గులుకుమిటారి చంద్రుఁ డను కుండను బ్రాఙ్నగచక్రవాళ మన్
చెలువపుబోది యన్ బగటిచెట్లకుఁ దా నమృతంబు వోయ ని
మ్ముల మొలకెత్తు లేఁజిగురు ప్రొద్దుటియెండ ముదంబు మీ కిడున్.

తా. రాత్రియను కన్య మూడులోకము లను పూవుతోటను పెంచుటకై చంద్రుదను కుండను, తూర్పుకొండపై నిలిచి పగటిచెట్లకు అమృతము పోయుచున్నదో అనునట్లున్న లేతయెండ మీకు శుభము నిచ్చుత. 34

చ. అరుణుని యెఱ్ఱచాయ లెనయ న్నగడంబుల డంబు లొక్కటన్
మెరమెరఁ దారకాచ్ఛవి భ్రమింపఁగ ముత్యపుఁజాయ లొక్కటి
న్నిరి గన నల్లనల్ల నగు చీఁకటిసంద్రము ద్రావునట్టి పూ
ర్వరవి నిభాత్యపూర్వబడబాజ్వాలనం బిడు మీకుఁ బుణ్యముల్.

తా. ఇందు బాలసూర్యకాంతి బడబాగ్నితో నుపమింపబడినది. అరుణుని వలె, పగడములభాతి ఎఱ్ఱనై, అచ్చటచ్చట నున్న చుక్కలవలె తెల్లనై, అల్ల నల్లన-నల్లనైన చీకటియను సముద్రమును త్రావు బాడబాగ్నివలె నొప్పు ప్రాతః కాల సూర్యతేజము, మీకు శోభాయమాన మగు గాక. 85

ఉ. మద్దెల దిద్దిమల్ సరిగమా యను గీతులు గద్దెపద్దెముల్
గ్రద్దన దిద్దు వేలుపుల గాణలు తొల్లిటి సుద్దు లొద్దికన్
విద్దెలమారి వేల్పొరుసి పెద్దలు సద్దిడ ముజ్జగానకుం
దద్దయు జవ్వనం బొసగు నవ్యరవిప్రభ మీకు మే లిడున్.

తా. గంధర్వులు మనోహరమగు గద్యపద్యములతోడను, వేల్పు గాయకులు, మద్దెల ధ్వనులతోడను, ఇతరదేవతలు స్తుతులచేతను, నలరించు బాలసూర్యుడు జగంబునకు యౌవనం బొసగు గాత- 86

ఉ. రిక్కలు పల్చనై తమము ప్రీలఁగ నిందు శిలాళి పాఱుటల్
తక్కఁగఁ జంద్రుఁడు న్మెఱుఁగు దప్పుట నోషధు లుక్కువీడ నా
చక్కని ప్రొద్దు ప్రాఙ్నగము చక్కని కొంచెము నిల్చియుండ ద
వ్వెక్కియు నెక్కకున్న దివసేశుని తేజము మిమ్ము బ్రోచుతన్.

తా. చుక్కలు పల్చనకాగా, చీకటి మాసిపోవగా, చంద్రకాంత శిలలు తప్ప చంద్రుడు కాంతిహీనుడు కాగా, ఓషధీలతలు, తమ జిగి వీడగా తూర్పు కొండ నెక్కియు, నింకను దీర్ఘముకాని బాలసూర్యకాంతులు మీకు సిరుల నొసగు గాత. 87

చ. నవనవ యౌవనంబుల వనంబుల రక్తదళంబు దంబుగన్
గవకవఁ జూపి చెంతలను గ్రంతలఁ గుంతల దాఁటి సాటి నా
కెవ రెవ రంచు దోడుపడు నీడకు చేడియతమ్మి దుమ్మురా
రవరవ నిక్క నెక్కు దినరాట్ ఛవి మీ కగుఁ బాపశాంతికిన్.

తా. వనములకు యౌవనము నొసంగి, ఎఱ్ఱనైన దళములకు నెఱ్ఱని కాంతి నిచ్చి, దగ్గఱగను, దూరముగను, మాటుచోటను నదిలేక, సమస్తజగంబును వెలిగించు సూర్యకాంతి మీకు పాపశాంతి చేయునుగాక. 88

చ. మురిసిన తమ్మిపూవు జలముం గులికించునె కాని యావిరిన్
నెరపవు చూడ్కులన్ వెలుగు నింపునె కాని యొకింతయేనియున్
చుఱచుఱ నీవు ప్రాఙ్నగము చోటను మున్నటుపై దివంబునన్
వరుపదికల్ నటించు శుభ భాను నవాంశులు మీ కొలార్చుతన్.

తా. తమ్మిపూవందలి జలమును కులికించును గాని-ఆవిరిగా మార్చదు. చూపునకు వెలుగునింపును గాని ఒకింతయేని, చుఱచుఱ మనదు- తూర్పు కొండనే గాక, దినంబంతయు నిట్లే ఏకాకారముగా నుండు బాలసూర్య కిరణములు-మీ దోషములు పోకార్చు గాత. 39

చ. అమరవిభుండు గొల్చెడి బృహస్పతి కే పెదవాద దిందు కే
మమరుల జ్యేష్ఠుఁ డయ్యుఁ జతురాననుఁ డైన విరించికేని నో
రు మెదల దర్చవేళ బెదరుం దడబా టగునట్టి సచ్చరి
త్రము గల సూర్యదేవుని స్ఫురన్నవరోచి సుశాంతి మీ కిడున్.

తా. అర్చనావేళయం దెవని యుదయము లేక, ఇంద్రగురువగు బృహస్పతికి మాటలు వెలువడవో, బ్రహ్మదేవునికినైతము వాక్కు విజృంభింపదో అట్టి సూర్యోదయకాంతి, మీకు శాంతి నిడుగాత. 40

చ. మలలకు మీఁద జేగురులు, మ్రాకులయందుఁ జివుళ్లు వార్ధిచా
యలఁ బగడంబులున్ దెసల హత్తుల నెత్తులఁ జెందిరంపుఁ బూఁ
తలు దివి మేరుశైల భువిఁ దప్త సువర్ణములై స సూర్యర
శ్మ లుదయకాల శోణములు సొంపుల నింపుల మీకు నింపుతన్.

తా. కొండలమీద జేగురుధారలై, చెట్లయందు చిగుళ్లై, సముద్రతీరమున దిగ్గజ కుంభస్థలముల సిందూరములై, మేరుపర్వత శిఖరములు తప్త కాంచన సన్నిభములైన నెఱ్ఱని సూర్యకాంతులు మీకు సంపు నింపుత. 41

చ. నెల తమిమీఱ నస్త శివునెత్తిన యుంద వెసం దమోహలా
హలము నిపీతమైన నరుణాఖ్య కిసాలయ మొప్పు ప్రత్యుష

స్సలలిత కల్పకం బొదవఁ జక్కని కెం బసపంచు కోకతో
వెలలు సరోజలక్ష్మి యనఁ బేర్చు రవిప్రభ మీకు మేలిడున్.

తా. అస్త్రాదీశుడైన శివుని జడలయందున్న శశి కాలకూటమను విషము గ్రాగగా, అరుణ కిసలయములవలె ఎఱ్ఱనైన కల్పకమువెనుక చక్కని పసుపు చీర ధరించిన లక్ష్మి యట్లు ప్రకాశించు సూర్యకాంతలక్ష్మి మీకు సంపద లొసంగు గాక. 42

ఉ. పుట్టదు సంద్రమం దచటఁ బుట్టిన కౌస్తుభ ముఖ్యవస్తువుల్
చుట్టలు గావు పద్మమును జూడము చేతను, విష్ణువక్షమున్
ముట్టదు లాఁతి లేవెలుఁగు ముజ్జగమందు వ్యవస్థ లేర్పడన్
బుట్టెడు మండలాగ్రమునఁ బూషున కా సిరి మీకు మేళ్ళిడున్.

తా. సముద్రములో పుట్టలేదు. అందు పుట్టిన కౌస్తుభము మొదలగు నవి చుట్టములు కావు ; చేతిలో పద్మము లేదు. విష్ణువక్షఃస్థలము ముట్టదు. అయినను లక్ష్మివలె సమస్తము నిచ్చి, సూర్యకాంతలక్ష్మి మీకు సిరుల నొసగు గాక. 43

## అశ్వవర్ణనము

ఉ. మేరువుమీఁద నున్ననగు మేల్మిశిలల్ నలఁగంగనీక సా
మీరజవంబునం దుముకఁబెట్టిన గుర్తులు వేఱె లేమిచే
చారుతరార్క కాంతమణిజం బగు వహ్నియ దారి తెల్పఁగా
మీరిన సూర్యుగుఱ్ఱములు మేలుగ ముజ్జగ మేలు గావుతన్.

తా. మేరుపర్వతముపైనున్న శిలలు నలగకుండ, మహావాయు వేగముతో దుముకుటచే గుర్తులు వేఱే లేకపోగా, సూర్యకాంత శిలలు కరిగి, అందలి అగ్నిచే దారి స్పష్టమగుచుండగా పర్యటించు సూర్యాశ్వములు మీకు శోభన మిడుగాక. 44

ఉ. దగ్గఱి బగ్గునం గిరణతాపము వీపులవేఁప దప్పిమైఁ
దగ్గక యొక్కనాఁట దివిదారి వడారము దాఁటి వేసటన్

సగ్గుచు గంగ నీర్మెకలు సాచి శిరంబులు వాంచి త్రావుచో
జగ్గెడు సప్తసప్తి ఘనసప్తులు మీకు హితంబు సేయుతన్.

తా. ఒక్కొక్కప్పుడు దగ్గఱగా సూర్యకిరణముల వేడిమిచేత పీపులు చుఱుక్కుమనుచుండగా. దప్పిచే- నాకాశమార్గము నధిగమించుచు ఆకాశ గంగ కనబడగానే మెడలువంచి గంగనీరు త్రాగెడి రవి గుఱ్ఱములు మీకు మేలు చేయుగాక. 45

చ. పటికపు మానికాల చలపం దమనీడలు వేటె వాజులం
చటు నిటు బోవఁ బ్రొద్దుతిరుఁ గాలినఁ గెంపులఁ జూచి
సంజ యం
చటమట మెల్లనం జను నొయారపు పచ్చలపట్ల గానరా
కిటుల ననూరు మేరుశిఖ నేఁచు నినాశ్వము లేలు మిమ్ములన్.

తా. స్ఫటిక భూములయందు తమ ప్రతిబింబములు చూచుచు నిల్చి అచ్చటచ్చట ప్రొద్దు తిరిగిన ట్లెఱ్ఱని సంజకాంతులను చూచి మెల్లగా నడుచుచు, పచ్చగా నున్న మరకత శిలలమధ్య లీనమగుచు, సూర్య రథసారథియైన యనూరునికి పరిశ్రమ కలిగించు నశ్వములు మీకు శ్రేయస్సుల నొసగుత. 46

చ. అహిరిపు నన్న లాగిన నొయారముగం జలియించి పాఱుచున్
గుహజననీ సమీపమున గొప్పరథంబు గతిం జవంబుతో
వ హరితకాంతితో మఱుఁగు దబ్బలతో నపరార్క నందినీ
మహిమ వహించు నర్యముని వాజ్వపుబంతి శుభంబు మీకిడున్.

తా. సూర్యసారథి కళ్లెములను లాగుచుండగా. ఆకాశగంగ సమీపమున కొంచెము వేగముగా బోవుచు. ముఖములనిండి వెలువడు నురువులు పచ్చని కాంతితో నిండగా, యమునానదివలె నొప్పు సూర్యాశ్వపంక్తి మీకు శుభముల నొసగుగాత. 47

ఉ. దారికి నావ లీవల సుదాంధులు స్వర్గిరి వంగుచు న్నమ
స్కారము సేయఁ గిన్నరుల కన్యలు సిగ్గున మోము లగ్గుహా
ద్వారములం దిడంగ నరుణాఖ్యుఁ డదల్చినఁ గావి యించుకం
తోర మెడం దినేద్ధయము లూఁడెడి హేషలు దోలు మీ కొాలల్.

మేరుపర్వతోపాంతముల దేవతలు గిరియందు వంగి నమస్కారములు చేయగా, కిన్నరీకన్యలు సిగ్గుతో గుహాద్వారములనిల్చి చూచుచుండగా, సారథి కళ్లెములు లాగుచుండినను, మెల్లమెల్లగా నడచు రవి హయములు మీకొలల నడంచుత. 48

ఉ. తమ రుచిచేతఁ బచ్చనగు తట్లమొగుళ్లను ఱెక్కలొప్పఁ గ
కళ్లెములను లాగ నెత్తురులులేచిన నోళ్లను ముక్కులొప్ప వో
మమునను దుత్తుమంచు వడిఁ బాఱు సుమేరుశిఖాగచారికీ
రము లన నొప్పు సూర్యునిగుఱ్ఱాలు వరాల సరాలు మీకిడున్.

ఆకుపచ్చనైన తమ శరీరకాంతిచే తెల్లనగు మేరుపర్వతపు చరియలను పచ్చదనము కలిగినట్లు చేసి, మేఘములను రెక్కలతో కళ్లెములు లాగుటవలన నోటినుండి వచ్చు రక్తము నెఱ్ఱదనముతో మేరుశిఖరాగ్రమున చిలుకలవలె తుఱ్ఱుమని పాఱు సూర్యాశ్వములు మీకు శ్రేయము లొసగుత. 49

## అనూరు వర్ణనము

చ. పొడుపుగొండ రంగమునఁ బొంకపు రేతెఱచొత్త లక్ష్మి క
న్పడ నుడుపంక్తి పేరిటి నవంబగు పూవుల దోయిలింత జొ
ప్పడ నిడి సూత్రధారత దివంబున నాలుగు జాలయంకముల్
నడపెడి లోకనాటిక ననం జను నయ్యరుణుండు మీ కగున్.

తా. తూర్పుకొండ అను రంగస్థలమున రాత్రి యనెడి తెర తొలగగా, నచ్చటచ్చట నున్న నక్షత్రములు పుష్పాంజలిగా, నాలుగు జాములనెడి నాలుగంకముల జగన్నాటకము ప్రారంభించు సూత్రధారుడైన అరుణుడు మీకు శుభంబు లిడుగాత. 50

చ. హరులకు నగ్రగుఁ డన్, హరిన యాతఁడు మోచుఁ బక్షక్రియం జరా
చర సమభావకర్మతతి సాక్షిని యాతఁడు పక్షపాత సం
చరణుఁ డటంచు నీడునను సామ్యము నొందియు దృక్ర్పుతి ద్విషన్
దరిమెడి క్షేమ ధామములధామ మనూరుఁడు వాపు మీ కొలల్.

తా. తాను సూరుని వాహనములగు గుఱ్ఱముల కగ్రేసరుడు. అతడు పశువువలె హరిని మోయుచుండును. తాను సర్వకర్మములకు సాక్షి. అతడు పక్షపాతము (ఱెక్కలతో ఎగురుట) కలవాడు. తాను జగమునంతను దీపింపజేయు సమరుచికల సర్వకర్మ సాక్షి. అతనికి బలమున్నను తాను వయస్సులో పెద్ద. ఈ విధముగా సోదరుడైన గరుత్మంతుని మించు స్థిరత్వము, ప్రకాశము గల అనూరుడు మీ కానంద మిచ్చుగాత. 5

మ. వఱువాతన్ హిమముల్ స్రవించు శశిశోభల్ ద్రావ జబ్బెక్కి-
ముం
దఱఁ గాష్ఠోజ్జ్వలదీపనంబు వెనుకన్ భానుం డటంచు న్నతా
దరత న్సిద్ధులు సాధ్యు లంబరమునన్ దత్తార్ఘ్యులై చూడ భా
స్కరసారథ్యము సేయు వేల్పు మిము రక్షాదక్షుఁడై యేలుతన్.

తా. ప్రాతఃకాలమున దూరమునుండి సూర్యుని స్తోత్రము చేయువారును, అర్ఘ్యముల నిచ్చువారును వీక్షించుచుండగా, సిద్ధులు మొదలైనవారు ఆకాశమున చూచుచుండగా, చంద్రకిరణములయందు మంచుకణములనాని తూర్పు దిక్కున సూర్యునిగొల్చుచు నొప్పు సూర్యసారథి మీకు శోభ కలిగించుగాక. 52

మ. వఱువాత న్వివిధ రశ్మలం దుదిపగల్ మానన్ స్వతంత్రుండుగాఁ
బరిషత్స్తోత్రవిలాసుఁగా హరిపదవ్యాపారుఁగా నా ద్విజే
శ్వరునందున్ సమయప్రకర్ష లఘుతం జాటంగ నేవేచ్చమై
నరుణుండుం దనపాటి సేయు నరుణుం డక్రాంత మేలు
న్మిమున్.

తా. ప్రొద్దుటనే సూర్యునివలె కిరణములను వ్యాపింపజేసి, స్వతంత్రుడై లాఘవముతో వానిని వ్యాపింపజేసి బుధులు ప్రశంసించుచుండగా బ్రాహ్మణులకు విలాసము గల్పించి, రెండవ సూర్యునివలె నొప్పు ననూరుడు మీ కనూన సుఖముల నిచ్చుగాక. 53

ఉ. రే యను తీగకుం బరఖురీతిఁ దమోఽటవి కచ్చిభాతిఁ బ్రా
క్రోతజనేత్ర కల్వలనుఁ గోయు కరాగ్రగతిం జగ త్తుపో

ధాయతి ధాతపద్ధతి వియద్భువు లేర్పడఁ దొల్చినట్టి మేల్
తాయిస్థితిన్ దలిర్చెడు ద్యురత్నముసారథి మీ కొలార్చుతన్.

తా. చీకటి యను లతను ద్రెంచు గండ్రగొడ్డలియై, చీకటి యను నరణ్యమును దహించు గార్చిచ్చై, తూర్పు దిక్కనెడు వనిత కష్టములను తొలగించు హస్తమై, ఆకాశమును భూమిని నైక్యముసేయు బ్రహ్మవలె నొప్పి, దివి భువి వేఱుచేయు దివ్యరత్నమౌ సూర్యసారథి మీకు మేలుచేయుగావుత. 54

ఉ. వానకుఁ దూర్పుగాలివలెఁ బావకకీలకు ధూమమట్లు లో
కానకు నాదిసృష్టిగతిగా శ్రుతిరాశికి నోంకృతి స్థితిన్
భానుని గ్రుంకునందు నటనం బిడు శూలికి నంది నాందిలా
గైనవి నాప్తుతే ర్నడపు నవ్వినతాత్మజుఁ దేలు మిమ్ములన్.

తా. వానకు తూర్పుగాలి రీతి, అగ్నికి పొగ యట్లు, లోకమునకు మొదటి సృష్టివలె వేదమునకు నోంకారమైన కరణి సంధ్యాకాలమున, శివుని నాట్యారంభమున నాందీభాతి సూర్యునితేరు నడపు ననూరుడు మిమ్మేలును గాక. 55

ఉ. మేలిమిబండలం గలసి మించిన సూర్యగుఱాల చాలునుం
బోలెడు పచ్చలం గొలికిపూసకు మేల్కరువిందమై స్వకీ
యాలఘుదీప్తి మేరుకుభృదాభరణం బొనరించు నమ్మహా
వ్యాళవిరోధి యన్న దవులం బిడి మీ యఘపంక్తి నెట్టుతన్.

తా. మేరువుపై రథము నడపునపుడు బంగరువన్నె గాంచి, ఆ వెనుక గుఱ్ఱములు ఆకుపచ్చని కాంతిచే నచటి బండలు ఆకుపచ్చరంగుతో నొప్పగా, తనయొక్క స్వకీయమగు కాంతిచేత మేరుపర్వతమునకు నాభరణాయమానమైన అనూరుకు మీ పాపములను బాపుగాత. 56

చ. చిఱుతెనఁగోల బెత్తమును చేతను బట్టి గుఱాలపేరి స
ప్తరుచిర కక్ష్యలం గఢపి ధ్వాంతపదావళి తొప్పి తేర్తి ఘుం
దిఱువుగ నుండి నేర్పున ధరేశులఁ జూపు జగత్ప్రభా మనో
హర దినరాజు పెద్దప్రతిహారి సదా మిముఁ బ్రోచుఁగావుతన్.

తా. జగమనెడు మహాసభకుగల ఏడు కక్ష్య లను ఏడు గుఱ్ఱములచే దాటించి, చీకటిని తరుముచు, ఏడు కులపర్వతములను లోకమునకు కన్పింప జేయుచు, కనగోల యనెడు బెత్తముతో సూర్యునిరాక తెలుపు ప్రతిహారియైన యనూరుడు మీ యఘముల దొలగించుత. 57

ఉ. పగ్గము లౌనటం చరుణ వారుణపాశము లంటఁబోకుమా
యెగ్గిది యేకచక్రమని కృష్ణునిచక్రము ముట్టఁబోకుమా
- దిగ్గున నెన్మిదౌ తగును దేవహయం బనఁబోకుమా యటం
చగ్గముగాఁ బరోపకృతి కర్కుఁడు దిద్దినవాఁడు మీ కగున్.

తా. తనకు రథము తోలుటకు తగిన సాధనసామగ్రి యితరులనుండి గ్రహింపకుండ సూర్యుడు తన సారథియైన యరుణుని వారించుచున్నాడు. పగ్గములు సరిగా లేవని వరుణుని పాశములను గ్రహింపకుము. నీ రథమున కొకటే చక్రము గలదని విష్ణుమూర్తి చక్రము నడుగకుము. నీ రథమున కేడు గుఱ్ఱములున్నవని ఎనిమిదవ గుఱ్ఱముకొఱకు ఇంద్రుని యుచ్చైశ్శ్రవము కోర కుము" అని వారించు సూర్యుడు మీకు శుభముల నొసగుగాక. 58

మ. పురుహూతా! కనుదమ్మి లొప్పె శిఖిదీప్తుల్లేవె యిచ్చోటఁ గా
సరము న్నిల్పుము తాతపాదనతికై సౌరీ సరే నిరృతీ!
వరుణా! చూడుము, మారుతాయుడితి తెల్పంబడ్డదో శ్రీదయీ
శ్వరమీశే యని వైపుతేండ్ల నను భాస్వత్సూతుఁ దేలున్
మిమున్.

తా. ఇంద్రుడా! నీ వేయికనుదమ్ములు క్షణమాత్రము వికసింపగలవు. అగ్నీ! నీ కాంతి యిక తగ్గును. యముడా! నీవు నీ వాహనమును కొంచెము మరల్పుము. నైరుతీ! నీ వట్లే చూచుచుండుము. వరుణుడా! ఈ గుఱ్ఱములను నీటిచే తడుపుము. వాయుదేవుడా! గుఱ్ఱమునకు జవసత్త్వముల నిమ్ము. కుబేరా! శివునకు నమస్కరింపుము- అని అష్టదిక్పాలకులను హెచ్చరించు అనూరుడు మీకు మేలు చేకూర్చుగాక. 59

చ. బడలఁడు దప్పిలేదలఁత బట్టదు మైమఱువండు పాంథుడై
మిడిమిడి యెండ బగ్గుమని మీఁదఁబడం జగమెల్లఁ గ్రుమ్మఱున్
సడలఁడు పచ్చగుఱ్ఱముల చాలను రమ్యవనంబు పట్టి యీ
తఁడు రవిసూతుఁ డీప్సిత పదార్థములం గృప మీకునిచ్చుతన్.

తా. తీవ్రములైన సూర్యకిరణములు దాకియు నెవడు బాటసారివలె మూర్ఛ జెందడో, ఎవడు దప్పినను తన దేహము సరిగా నుంచుకొనునో, ఎవడు వాడికిరణములచేత నొరెందకుండ నుండునో, అట్టి సూర్యసారథి మిమ్ము బ్రోచుగాత. 60

(సూర్యకిరణముల వేడికి మానవులకు పై యనుభవములు గలుగును.

ఉ. తీరిన గంగలో నిసుకతిన్నెల దూరిన డెక్కలాడ క
మ్మేరువుకందరంబు లను మెట్టుల గ్రుమ్మిగినఁ గాళ్లు తొట్రిలన్
మీరిన పచ్చరాగరిక మేయఁగ సూర్యగుఱ్ఱాలు నిల్వ నొం
పూనఁ జలోచలోజవిది హుమ్మను నగ్రగుఁ డేలు మిమ్ములన్.

తా. ఆకాశ గంగాతీరపుటిసుకలో గుఱ్ఱముల డెక్కలు కూరుకుపోవు చున్నవి. మేరుపర్వత శిఖరముల కాళ్లు జాఱుచున్నవి. దూర్వాంకురములుగల స్థలములోయని మరకతములుగల స్థలముల నాగుచున్నవి. అట్లు గుఱ్ఱముల వేగపు నడకను నదలించుచు, హుంకారము సేయు ననూరుడు మీకు శ్రేయము చేయుగాత. 61

## రథవర్ణనము

ఉ. శీకుగఁ బ్రాగ్గిరి న్వెనుక డెక్కలయంచుల నిల్వ తొమ్ములన్
జౌకుమొయిళ్లు మేనులను సాచక యెత్తిన శబ్దహీనమై
ప్రాకెడి చక్రముం గలిగి పాఱ ననూరుఁడు లేచి మ్రొక్కనన్
వీకున సంతరిక్షమున వే జను సూర్యునితేరు మీకగున్.

తా. బలిసిన తొమ్ములచే మేఘములను గ్రుమ్ముచు, గొరిజలాధారముగా నిలుపబడియున్న యశ్వము లొక్కమారు రథము కదలించుటచేత అనూరుడు

వెల్లకిలబడి సూర్యునికి నమస్కారము గావించుచున్నాడు. అట్టి రథము మీకు మేలు చేయుగాత. 62

ఉ. అంతోటి చిమ్మచీఁకటుల నార్పు కరంబులు వేయి గల్గు భా
స్వంతుని మోయలేక శ్రమబట్టు మరుత్తుల నక్కడక్కడన్
వింతగ మెత్త లార్తురని వేఱఁగ వేఱఁగ నేర్పరించు న
త్యంత పటుప్రభావ జగదక్షరథంబు శుభంబు మీ కిడున్.

తా. చీకటిని నిశ్శేషముగా పోగొట్టుటకు వేయికిరణములు ధరించిన సూర్యునికి స్థానమై, సప్త వాయుమండలముల నధిగమించిన సూర్యరథము మీ పాపముల బాపుగాత. 63

మ. మరకతాశ్మైన మహోహాలం బొడువ నాఁ బ్రక్క ల్వ్రీదంష్ట్రాఁకి వా
ర్ధరముల్ ఱెక్కలుగా ననూరుని వధిం బ్రప్రీతుఁ గావించి యా
హరి యేరీతిఁ దలంచు నట్లు చని తార్క్ష్య ప్రక్రియం బోవు భా
స్కరుతే రెప్పుడు మిమ్ము బాపచయముల్ చక్కాడి
రక్షించుతన్.

తా. ఏది గమనవేగముచేత తన సారథికన్నయైన గరుత్మంతునివలె నొప్పి, అనూరునకు సంతోషము గలిగించుచున్నదో, ఏది మేఘమండలము చీల్చుకొని పోవునపుడు ఱెక్కలుగల గరుత్మంతునివలె నొప్పుచున్నదో, అట్టి రవిరథము మీకు కాంతి నొసగుగాత. 64

చ. నడచుటకుం దనాన నొకనాఁటను దీర్ఘ జగంబు చుట్టుచున్
గడు బరువై సుమేరువుశిఖన్ మణికోటుల నుగ్గు సేయుచున్
బుధమికి తీఁద గొంతవడి భూర్యపరాద్రిని కొంత సేపు దా
నడుగున ముందు సూర్యరథ మాపద లెల్లెడ మీకుఁ బాపుతన్.

తా. ఏది ఒక్క పగటికాలమునందే మేరుగిరిని చుట్టి ముజ్జగముల నాక్రమించుచున్నదో, ఏది పూజ్యమైన దిక్కులతో సంబంధము గల్పించుచున్నదో, దేనినడక యింతమాత్రమని నిర్ణయించుటకు వీలులేదో, అట్టి సూర్యునిరథము మీ దొసగుల తొలగించుగాక. 65

ఉ. దౌలకుఁ దూలుఁ గాంతి చెడి తారు గ్రహంబులు కేతనాంబరాం
దోళితుఁడై చనున్ శశి, విధుంతుఁడున్ గ్రసనేచ్ఛ వెంట రా
మూలుఁగు జక్రముల్ హరులు బుఱ్ఱన గాంగజలంబు ప్రీలు వి
ట్లోలి దలిర్చు భాస్కరరథోత్తమయానము వేలు మిమ్ములన్.

తా. ఏది తేరినాగ తాకటచే చీల జారి గ్రహమండలము చెల్లాచెదరు గావించుచున్నదో, ఏది రాహువునకు విష్ణుచక్రమను వెఱపు గల్గించుచున్నదో, ఏది తమ టెక్కెములగాలిచే చంద్రుని గడగడ వడకించుచున్నదో- అట్టి రవి రథము మీకు సంతోషము గూర్చుగాక. 66

ఉ. కాదిని జార మత్తమునఁ గంకణఘోరముఁ గట్టి కంబమం
దోడక ధూప మిచ్చి విరులొయ్యనఁ గూబరమం దమర్చి మే
ల్జాడఁ బటీరగంధమునఁ జక్రము మెత్తుచు సిద్ధభామినుల్
వేడుక మింట మ్రొక్కెడి రవిప్రభుతేరఘభేది మీకగున్.

తా. ఏ రథము చీలను సిద్ధస్త్రీలు, పసుపుతోరములతో ప్రొద్దుట నర్చింతురో, ఏ రథచక్రములను వారు గంధముతో నలంకరింతురో, అట్టి అంశుమాలి రథము మీ కనంత సౌఖ్యముల నిచ్చుగాత. 67

ఉ. ప్రక్కల నెక్కుడై తురగపద్ధతి లేచు పసిండిదుమ్ముతోఁ
జక్కఁగ నెప్పుడుం దిరుగు చక్రము నేములలోఁతు పాఱుచున్
వెక్కిన మేరువందుఁ దనవేఁడిమి నింకిన దిన్నెలౌ సుధా
భుక్కులయేఱు నాఁ దగిన పూషునిరథ్య యొకండు మీ కగున్.

తా. ఏదితెరలునవ్వు దిరుప్రక్కలను బంగారురజము చల్లుచుండునో ఏది తన వేడిమిచే మేరుగిరిపై దీపించు ఆకాశ గంగాజలములను చల్లుచు, ఆ శిఖరమును తెల్లగా చేయుచున్నదో, అట్టి సూర్యరథమార్గము మీకు శోభనము లిచ్చుగాత. 68

ఉ. మ్రొక్కఁగవచ్చు దేవగణముఖ్యుల వాలది త్రోవగాఁగ నా
చుక్కలు చక్రఘట్టనను జూర్ణముగా నది దుమ్ముగాఁగ బల్

పెక్కౌను వాజిహేష దివి నిండిన నేమిరవంబుగాఁగ మి
న్నక్కుతలంబుఁ బోలఁగ నొనర్చిన యర్కు రథంబు
మీ కగున్.

తా. ప్రాతఃకాలమున నమస్కరించుచున్న దేవతల శ్రేణి మార్గము చూపగా రథవేగమున పొడియైన నక్షత్రముల ధూళితో, చక్రము చుట్టునున్న పట్టాధ్వనితో భూమియందువలె ఆకాశమునందును సంచరించు నరుణుని యదరము మీకానందము గల్గించుగాక. 69

ఉ. జానగు దేవయానముల చాలున వచ్చి ద్యుషద్వితానముల్
పూని, నమో యన న్వదిని బోవుచుఁ గానక సైకతంబులన్
మానగు గంగ మెల్ల జన మంథనమందిరమందుఁ బారిజా
తా నుపమానసూనముల నావిన భానురథంబు మీ కగున్.

తా. వందనము చేయుటకు వచ్చిన బృందారక శ్రేణులు సమర్పించు పూవులు, ఆకులు గలదియై, ఆకాశ గంగాతీరమున నతి త్వరిగతి గలదియై మందరనగరముల బోలిన మందరశైలముల మందమందగతి నడచు సూర్య స్యందనము, మీకు శుభములను చేకూర్చుగాక. 70

చ. హరిహరులన్ సదృశపతి యశములన్ మఱి చక్రి చక్రమున్
సురలు సురంహ మల్ల యరుణు న్వరుణుండును స్థాణు
స్థాణుఁడున్
విరివిగఁ గూబరంబునఁ గుబేరుఁడు గొల్వఁగ నిత్యయుక్తి మై
పరహితవృత్తి మెచ్చు ఖరభానువిస్యందన మేలు మిమ్ములన్.

తా. దేని చక్రమును విష్ణువు స్తుతించుచున్నాడో, దేని యశ్వములను ఇంద్రుడు శ్లాఘించుచున్నాడో, దేని టెక్కెమును శివుడు పొగడుచున్నాడో, దేని యిరుసును చంద్రుడు స్మరించుచున్నాడో, దేని నొగను కుబేరుడు స్తుతించుచున్నాడో, సురసమూహము దేనిని స్తోత్రము చేయుచున్నదో అట్టి సూర్యరథము మీకు నుల్లాసము గల్పించుగాక. 71

మ. నయనాహీనుఁడు మూలమం దలరఁగా నాకౌకసుల్ పాదముల్
నియతిం గొల్వఁగ నెంతయున్ బలి హరుల్ శీఘ్రంబ లాగన్ మహా
వియదంభోనిధిలోన మంథరము నా వింతై కడుం బొల్చు న
వ్యయ రత్నంబు రథంబు తుల్యమగు భాగ్యం బిచ్చి మి మ్మేలుతన్.

తా. ఏది మందరనగమువలె ఆకాశమను నంభోధియందు దిరుగుచున్నదో, ఇంద్రుడును బలిచక్రవర్తియు దేని నెల్లప్పుడు పొగడుచుందురో- అట్టి మందరాద్రివలె నుండు నంశుమాలి రథము మీకు సకలసంపదల నొసంగు గాత. 72

## మండల వర్ణనము

చ. పగటికి బీజమున్ తిమిరబాధక మక్షికి సంజనంబు ము
క్తిగవిని, ముజ్జగాలఁ దగు దీపము లోక్కోటియైన ముద్ద వా
న గురియు హేతు వబ్ధి రశనారసపానము పెద్దచెంబు పే
ర్మి గలుగు సూర్యమండలము మీకుసుఁ గోరిక లిచ్చుగావుతన్.

తా. ఏది చీకటిని పోగొట్టి లోకమునకంతకు దృష్టి ప్రసాదించునో ఏది నేత్రములకు ప్రకాశమిచ్చునో, ఏది యోగులు ప్రవేశించుటకు ద్వారమో, ఏది భూమియందలి జలముల గ్రోలు పాత్రమో అట్టి అతులమై, అమేయమై, తేజస్సులకు తేజస్సైన మండలము మీకు కల్యాణముల నిచ్చుగాక. 73

చ. చెలియలికట్ట మీఱి పడు సింధువునీటియదై సగంబు ము
న్నలమిన పెద్దచుక్కలకు ద్వారనభం బయి కొంచె కొంచెమై
పొలుచు వసంతు మోమునను బొట్టయి చీఁకటిగొట్టి ప్రాగ్గిరిన్
గలికితురాయి యైన దిననాథుని బింబము మీకు మేలిడున్.

తా. సముద్రమునకు వేలవలె, అనగా హద్దువలె నుండి శుక్రాది యితర గ్రహములను మినుకుమినుకు మనునట్లు చేయుచు, ఉదయాచల శిఖరమునకు

శిరోమణివలె, నత్యధికప్రభతో ప్రకాశించు సూర్యమండలము మీ దురితములను పోగొట్టుగాక. 74

ఉ. మేలిమికొండకుందనము మీఁదను జెక్కిన కెంపు నీలిమం
దేలిన నల్వకల్వలకు దిమ్మెకుఁ జుట్టును వ్రీల జూలునుం
గాలము పేరి వ్యాళము ఫణామణియై, ఘనమై, సదా జగ
జ్జాలము మండనంబగు త్విషాంపతిమండల మేలు మిమ్ములన్,

తా. ఏది తామరపూవు కాంతులతో పుటమార్చిన యట్లు ఉదయశైలము కాంతులను వెలార్చుచున్నదో, తామరలయందుండెడి తుమ్మెదలవలె ఏది నల్ల కలువల ఛాయలను విస్తరింప జేయుచున్నదో, ఏది దినముఖమున పూజింప దగిన దొడ్డమాణిక్యమైనదో, ఏది విశ్వమునకు నేకైకముగా సంపూర్ణభూషణ మగుచున్నదో, అట్టి సూర్యమండలము మీ పాపములను ఖండించుగాక. 75

ఉ. రేదొరరూపు సున్నయగు రిక్కల కేరును దిక్కులేరు దా
మోదర కౌస్తుభంబు చెడు నోటమిపాలగు నగ్గి కల్లలం
బోదరుతండ్రి చూ పదఁగు నొప్పుగ దీనిప్రభల్ తమంబులన్
ఛేదిలఁ జేయునట్టి రవిబింబము సేయు మిముం బునీతులన్.

తా. దేని యుదయమువలన చుక్కలకు రాజైన చంద్రుడు కాంతి హీనుడగుచున్నాడో, శివుని శిరస్సునందున్న చంద్రుడు ప్రకాశింపడో, విష్ణువు వక్షస్థలమున కౌస్తుభము కాంతి నీయదో అగ్నిహోత్రము తేజస్సుతో నుండదో అట్టి సూర్యమండలము మీ కభ్యుదయము ప్రసాదించుగాత. 76

చ. తొలుతను తూర్పునం బొడిచి తూరుపుపేర్దిశ కిచ్చు రెండు జా
ములతరి బగ్గనం దివసముం బొనరించుఁ గ్రమమ్ముగం జగ
మ్ములఁ దపియింపఁ జేయు మది ప్రోచును జీవన మౌచు
పుట్టువున్
గలుగఁగఁజేయు నిట్టి దిననాథునిబింబము ముక్తి మీ కిడున్.

తా. ఏది ఇంద్రునిదైన తూర్పుదిక్కున తొలుత ప్రకాశించుచున్నదో దేనివలన ప్రాగ్దిశ అను నామము సార్థకమగుచున్నదో, ఏది విస్తరించిన దినము

తేజముచే కాంతిమంతమగుచున్నదో, ఏది జగమునకు ప్రాణమైయున్నదో, ఏది జగత్సృష్టికి హేతువును రక్షణయు, పోషణయు నగుచున్నదో అట్టి రవి మండలము మీకు మోక్షము నొసంగుగాక. 77

చ. గలగల యెండునేలల యగుం జలధుల్ కులపర్వతంబులున్
దిలతులనంబులై నలుగు దిట్టపుఁ గాఁక యుగావసానవే
ళల నని లోకరక్షణపరాయణత న్నిఖిల ప్రభావళుల్
మెలపక వెల్గుమాత్ర మిడు మిత్రునిబింబము మీ ముదం
బిడున్.

తా. ప్రళయకాలమున సముద్రము లింకిపోవును. కులపర్వతములు పెల్లి పోయి తిలప్రమాణము లగును. అట్లు కాకుండ ప్రతిదినమును జగమును రక్షించు రవిమండలము మీకు శ్రేయము లిచ్చుగాక. 78

చ. చెరువు వియత్తలం బడుసు చీఁకటి తృప్తికి వచ్చునట్టి బం
భరములపాళి రాహువునుఁ బత్రము పత్ర మితారుణాభలా
యరుణునిశోభ లిట్టి దగునట్టి సహస్రదళంబుగాదె భా
స్కరు ఘనమండలం బిది సుసంగతి మీకును మంగళం బిడున్.

తా. ఆకాశ మను బావిలో చీకటి యను బురద చీల్చుకొని తేకులచే వికాసము చెంది, మూగిన తుమ్మెదలు రాహువువలె నొప్పగా నుండు రవి మండలము మీకు కల్యాణముల నిచ్చుగాక. 79

చ. పురహరునేత్ర మయ్యు నెఱపు న్నిరవద్యతఁ గామపూర్తి సం
సరణ సముద్రనావ యయి జౌకదు గాలికి నెల్ల వేళలం
దిరిగియు నభ్రమంబు జగతిం భ్రమనాశి విరుద్ధకార్యమై
సరసము సూర్యమండలము శాశ్వతసౌఖ్యము మీకు నిచ్చుతన్.

తా. శివుని మూడవనేత్రమయ్యు మన్మథుని దహింపదు సరిగదా కామము నభివృద్ధి చేయును. సంసార సముద్రము దాటించు ఓడయయ్యు గాలికి చెదరిపోదు. తిరుగుచున్నట్లు కనబడుచున్నను, స్థిరముగా నుండును.

ధ్వంసక్రియ చేసినను నూతన సృష్టి చేయును. అట్టి సూర్యమండలము మీకు శోభాయమాన మగుగాక. 80

## ర వి వ ర్ణ న ము

చ. శ్రితవిధులై బుధుల్ శ్రుతుల సిద్ధులు గీతిని సౌరగాతలున్
జతురతఁ జాటు గర్భముగఁ జారణులా స్యతబుద్ధియాతుధా
నతతి ముహుర్ముహుర్నతఘనాహులు సార్ఘ్యము సాధ్యులున్
మహా
వ్రతనియతిన్ ముముక్షువులు పక్షతఁ గొల్చు నవాద్రి మీకగున్.

తా. సిద్ధులు సిద్ధాంతవాక్యముల చేతను, విబుధులు వేదవాక్యముల చేతను, చారణులు చాటువుల చేతను, గంధర్వులు గీతముల చేతను, బ్రాహ్మణులు ప్రాతఃకాలమున అర్ఘ్యములతోడను, రాక్షసులు మనోనిగ్రహముతోడను నెవని స్తుతింతురో అట్టి సూర్యుడు మీ యఘముల నడగార్చుగాక. 81

ఉ. చెంగట నంగుగా వెలుఁగు చిచ్చులకొల్మినిఁ గాచి కాచి వె
ట్టంగతిమ త్తురంగఖురటంకముల న్వడిఁ గోసి కోసి ని
స్సంగ రథాంగసంభ్రమ లసన్నికషాప్తిని గీసి గీసి ము
ల్పంగుల మేరువుం దిరిగి వన్నియగట్టు నినుండు మీ కగున్.

తా. బంగారము పరీక్షించుటకు మూడు విధములు గలవు. 1. పుటము పెట్టుట 2) కొంచెము ఖండించి పరీక్షించుట 3) ఆకురాతి యొరపిడి.

ఎవని కిరణముల తీవ్రతచే. బంగారు పర్వతము (మేరు పర్వతము - సూర్యుడు దానిచుట్టు పర్యటించును.) పుటము పెట్టినట్లయినదై, రథాశ్వముల గొరిజల తాకుడుచే, పైకి పెట్లుచున్న ముక్కలు గలదై.. రథచక్రముల యొరపిడి - యను మూడు పరీక్షలకు లోనగుచున్నదో అట్టి రవి మీకు నభ్యుదయములు ప్రసాదించు గాత. 82

ఉ. బంగరుతమ్మి గంగఁ బ్రతిబింబ గనువాడదు నందనంబునన్
దుంగ సుమాళిలక్ష్మి కడు దోడదు నెండదు మేరుశృంగముల్

రంగు లెసంగుగాని చెదరంగఁ గరంగవు సత్కృపాప్తి ని
బ్బంగిని మార్దవంబు గలభాగ్య మహమ్ము నినుండు మీకగున్.

తా. చాల వేడి గలవియయ్యు సూర్యకిరణము లాకాశగంగ నీటిని సింకజేయవు సరికదా, అందలి కమలములను వికసింప జేయును, అట్లే చెక్కు చెదరకుండ నందనోద్యానమును ప్రకాశింప జేయును - మేరుగిరి బంగారు శృంగములు నెవ్వని తెల్లనైన కాంతిచేత తెల్లబడవో అట్టి సూర్యుడు మీ కాయురారోగ్యము ప్రసాదించుగాక. 83

ఉ. చీకటి నొక్కదానిన గ్రసింపదు కల్మష కిల్బిషంబులన్
సూకునుఁ దమ్మిమాత్రమ వినోది నొనర్పదు భక్తబోధన
శ్రీకము కేవల మ్మహిమ చేయదు శ్రేయముగూర్చు నుద్యమం
బేకము పూనియుం బను లనేకము సేయు నినుండు మీ కగున్.

తా. ఎవ్వడు కేవలము చీకటిని నశింప జేయుటయే గాక - పాపములను పోగొట్టుచున్నాడో, ఎవడు కిరణముల తాకుడు వలన, తామరలను కాంతి మంతము చేయుటయే గాక తనయడుగు దామరల మ్రొక్కు వారిని తేజోవంతులుగా జేయుచున్నాడో, ఎవడు, పగటికి కర్తయగుటయే గాక, మోక్షమునకు కర్త యగుచున్నాడో, ఆ భానుడు, మీకు, నిరంతర శుభములు చేకూర్చుగాక. 84

చ. పరవశవృత్తి చెయ్వుడిగి ప్రక్కలఁ బండి నిరాశ నూర్చి యే
దరిఁ గనఁ జీఁకపై నెగులు దాల్చినయట్లు జగంబుఁ జేయుచున్
మఱియొక లోక మభ్యుదయమాన్యము నేయఁగఁబోవునట్టి భా
స్కరుఁడు శుభక్రియాకలన సంతసము న్మిముఁ బ్రోచుఁ
గావుతన్.

తా. ఏ సూర్యుడు లేకపోయిన యెడల - ఉదయింపని యెడల లోకము చైతన్య రహితమై మట్టిపెల్ల వలె బడియుండునో మంచము పట్టి చేష్టలు దక్కి, బ్రదుకుదునో, బ్రదుకనో యను సందేహము గల మానవుని

వలె జగము పడియుండునో, నలుదిక్కులను కటిక చీకటి గ్రమ్మినట్లుండునో అట్టి సూర్యుడు మీ కవాప్త్యైశ్వర్యముల నిచ్చుగాత : సూర్యు డుదయింపనిచో లోకవికాసమే లేదని భావము. 85

చ. నిలుకడ లేదు లోకగతి నిల్చును దత్పరిపాలనంబునన్
వెలుఁగున లోకదృష్టి మిఱుమిట్లగు లోపలిదృష్టి మే లగున్
బలితపు లోకతాపమగు మౌనుల నిర్వృతి కారణం బగున్
లలి నిటుఁ బ్రాగ్దిశాధికవిలాసుఁడు భానుఁడు మీకు మేలిడున్.

తా. ప్రపంచమున కంతకు కాంతిని ప్రసాదించుటకు నాతడు తిరుగుచునే యుండును - కాని స్థిరముగా నుండును. జనులు చూచుటకు దుర్నిరీక్ష్యుడుగా నుండును కాని, భద్రములను గలిగించును. అతడు మనుజులను తపింప జేయును, అయినను ముక్తి నిచ్చును. అట్టి సూర్యుడు మీకు సంపద లొసంగు గాత. 86

ఉ. కాలము దప్పవాఱయిన కాఱులు పండు సువృష్టిఁ జేలు దే
వాళి మఘంబులం దనియు నప్పవమానుఁడు వీఁచుఁ జుక్కలున్
దూలవు, మోచు నద్రు లిలఁ దోయధి మేరను మీఱ దాశలున్
మేలగు నిట్లు ముజ్జగము నిల్పు దివాకరుఁ డేలు మిమ్ములన్.

తా. ఋతువులు తప్పక క్రమముగా వర్తిల్లును - వానలు సకాలమున వర్షించును - దిక్కులు చెక్కుచెదరక నిలచును - కులపర్వతములు కదలక యుండును - ఇట్లు ముల్లోకములను స్థిరముగా నిలిపిన తీవ్రాంశుడు మీకు తేజస్సు నొసగు గాత. 87

ఉ. చక్కనిచుక్కఁ బక్క నిడి శంభుఁడు గ్రుమ్మఱు వెండి కొండపై
న క్కడలి న్మురారి యహియందు సుఖంబుగ నిద్రబోవు దా
న క్కమలాసనుండు దినమంతయుఁ జిత్తనిరోధ మూనుఁ బెం
పెక్క నితండు ముజ్జగము నేలఁగ నీ రవి మిమ్ముఁ బ్రోచుతన్.

తా. కైలాసమున శివుడు అర్ధనారీశ్వరుఁడై సుఖముగా నుండును. పాల సముద్రమున శేషశయ్యపై విష్ణువు హాయిగా నుండును. కాని ఎవడు, ఒక్క క్షణమైనను విశ్రమింపక, లోకరక్షణకొఱకు ఉదయము మొదలు సాయం కాలమువఱకు తిరుగుచుండునో, అట్టి సూర్యుడు మీదొసగుల తొలగించు గాక. 88

ఉ. బింబము ఋక్కులై, లసదభీశులు సామములై యణుస్థితిన్
బింబము నొందువాఁడు మహనీయయజుశ్శ్రుతియై త్రయీమయా
డంబరమూర్తి యంచు నెదుటం బడి వైదికులెల్ల మ్రొక్క స్వ
ర్గం బపవర్గ మిచ్చు గ్రహరాజొసగున్ సిరి మీకు నిత్యమున్.

తా. సూర్యబింబము ఋగ్వేదము- కాంతి సామవేదము, సూర్యమండ లాంతస్థుడైన పురుషుడు యజుర్వేదము. ఇట్లు త్రయీమూర్తియై స్వర్గాపవర్గము లను ప్రాణికోటిని కటాక్షించు సూర్యుడు మిమ్ములను రక్షించుగాక. 89

శా. అయ్యల్ లోకహితప్రచారులు సురేంద్రాదుల్ సుతుల్
దైత్యులున్
త్రయ్యల్ సేసిన జోదు లయ్యదితి కెవ్వారున్న మౌనివ్రజం
బయ్యాదిత్యపదంబు వీని కగుఁగా కంచు న్నుతుల్ సేయు న
క్షయ్యప్రాభవుఁడైన సూర్యుఁడు సమస్తశ్రీలు మీకిచ్చుతన్.

తా. అదితి సంతానమగు దేవతలందఱు నెవని సేవించి సూర్యుడాదిత్యు డను శబ్దమును సార్థకము చేయుదురో - సమస్త మునిగణము నెవని సంత తము స్తుతించుచుండునో, అట్టి సూర్యుడు మీకు శుభప్రారంభముల్గూర్చు గాక. 90

చ. వెలుఁగున మంటమేలిమియు వృష్టిజలాకృతి సంస్కృతి న్మహీ
నిల తనువృష్టిమన్ జగతి నిప్పుమెయిన్ మదిఁ గోర్కెలిచ్చి యు
జ్జ్వలలితమూర్తియుక్కి మినుచాయయు దర్శనుఁ జంద్రు
ధూపు ని
ట్లలరి స్వమూర్తితో నెనిమిదౌ శివలీలల బ్రొద్దు మీ కగున్.

జిక్కఁడు దేశకాలముల చేతికి వానిన లోఁగొనున్ సదా
యిక్కతనం బ్రదిలోకహితుఁ డౌ నతుఁ డా తపనుండు మీ
కగున్.

తా. ఒక ద్వీపమున నెండ కాయుచుండగా, మఱియొక ద్వీపమున వెన్నెల కాయుచుండును. దేశ కాలములు సంధ్యాద్యవస్థా విశేషములు, ఎవనికి వశమైనవో, ఎవడు తన పాలనాసామర్థ్యముచేత లోకమునకంతకు హితము గావించునో అట్టి సూర్యుడు మీ కహరహము శోభనల నొసగును. 97

ఉ. వ్యగ్రము లగ్ర్యసుగ్రహభహోరిగురుల్ సముదగ్రలీలఁ బ్ర
త్యగ్రము లీషదుగ్రములు నౌ నురుగోవుల గోవు గౌరతా
భాగ్రతిఁ బ్రాగ్గిరి న్నిలచి ప్రాచి సరాగసురాగగా, దినం
బగ్రమునందుఁ జేసెడి గ్రహాగ్రణి మీ కగు నగ్రగస్థితిన్.

తా. ప్రాతశ్శైలమున నుదయించి, వడివడిగా లోకముల నెల్ల పర్యటించుచు, చంద్రాదిగ్రహములను వెలవెల బాఱజేయుచు, మేరుగిరి శిలలకు పసుపువన్నె నాపాదించుచు జగచ్ఛ్రేయము గలిగించి, ఎవ దేకైకముగా వెలుగొందుచున్నాడో, అట్టి గ్రహరాజగు సూర్యుడు ఘోరమగు మీ పాపములను రూపుమాపుత. 98

ఉ. వేదగురుండు పద్మజుఁడు విష్ణుఁ డజేయుఁడు శూలి శంభుఁడున్
శ్రీదుఁడు యక్షుఁ డయ్యముఁడు మృత్యువు పావకుఁ డగ్ని
యంచు డి
గ్ధాదిపదంబు లట్లని సుధాంశులకుం బడెనంచు నామమ
ర్యాదలు సార్థకంబుగఁ దనంత వహించిన ప్రొద్దు మీకగున్.

తా. సామవేదమున కుత్పత్తికారణము బ్రహ్మ-బ్రహ్మ. మధువైరి యగు విష్ణువు అజితుడు. జడముడి దాల్చిన మహాదేవుడు శంకరుడు. మృత్యువు కాలుడు. అలకాధిపతి ధనదుడు. జాతవేదుడు, పావకుడగు అగ్ని - అని యిట్లు

అమృతభోక్తలగు దేవతలకు, క్రియాగుణములు లేకయే దిత్థుడు-దవిత్థుడు అను నామములు కేవలము సాంకేతికములు మాత్రమే యగుచున్నవి కాని, దేవతల నామములలో గుణములను, సార్థకము చేయు నామము గలవా డొక్క సూర్య భగవానుడే. అతడు మిమ్ము నెల్లప్పుడు రక్షించుగాక. 99

చ. చుట్టము పక్కముం గురువు చూపును గాపును జ్ఞాతి జ్యోతియున్
పట్టగు ప్రాణదాతయును భ్రాతయు తల్లియుఁ దండ్రియున్ సదా
పెట్టనికోటయై సకల పృథ్వికి నన్నము నీళ్ల నిచ్చుచున్
దిట్టపు వెల్గులం దనరు దేవుఁడు మీకిడు వాంఛితంబులన్.

తా. దైవమో, గురుడో, తండ్రియో, స్నేహితుడో, చుట్టమో, కను వెలుగో, రక్షకుడో యని పరిపరి విధములుగా నెవని సర్వజనులు భావింతురో, అట్టి సర్వాకాలోపకారి యగు సూర్యుడు మిమ్మును నిరంతరము బ్రోచుగాక. 100

చ. నలుబది మూఁట, నాటఁట, గనం బదిరెంటనుఁ బన్నకొంట బెం
పలరఁగ నెన్మిదింట, నిరు పంక్తుల తేజము వాజులున్ హయ
మ్ముల నదలించువాని రథమున్ ఘనబింబము సూర్యదేవునిన్
దెలియగ నమ్మయూరుఁడు నుతించిన శ్లోకశతమ్ము మీకగున్.

చ. పొలుపుగఁ జేసె లోకహితబుద్ధి మయూరుఁడు నూఱుశ్లోకముల్
చెలువగు భక్తితోఁ బఠనచేసిన పుణ్యుఁడు ముక్తపాపుఁడై
బలధిషణాయువుల్ చదువు భాగ్యము సత్కవితార్థ పుత్రభా
క్కలన నరోగతామహిమఁ గాంచును సూర్యననుగ్రహంబునన్.

తా. మయూరుడను కవి భక్తిపరతచే రచించిన యీసూర్యస్తోత్రము నూఱు శ్లోకములను నెవరు ప్రతినిత్యము పఠింతురో, వారికి ఆరోగ్యము, కవిత్వము,

సంపద, బలము, తేజస్సు, ఆయుర్వృద్ధి, విద్య, ఐశ్వర్యము, ధనములతో సూర్యలోకప్రాప్తి చేకూరును. 102

దాసు శ్రీరామవిరచిత సూర్యశతకము సంపూర్ణము.



**Sri Surya Satakamu** **Rs. 4/-**

BY:

Mahakavi DASU SREERAMULU

---

మహాకవి దాసు శ్రీరాములుగారిచే రచింపబడిన

ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| తెలుగునాడు | రు. 2-00 |
| అభినవ గద్యప్రబంధము | రు. 2-00 |
| శ్రీ దేవీ భాగవతము | రు. 60-00 |

---

MAHAKAVI DASU SREERAMULU SMARAKA SAMITHI

3-4-885/A, Barkathpura, Hyderabad-27.